లను విశుద్ధహృదయములతో స్వామికి నివేదించి పిదపఁ దాము భుజించి గునపము పాఱ మున్నగు ఖననసాధములనుగైకొని వర్తకుని యింటికిఁ బోయిరి. ఆవర్తకుఁడును వీరినిఁ జూచి వ్యాపారబాహుళ్యమువలన తామేర్పఱచికొనినది మఱచి "ఏలవచ్చితిరి?" అని వారినిఁ బ్రశ్నించెను. అంతట కుంభారు సంగతి అంతయు జ్ఞాపకము చేసి "మేము బావి త్రవ్వెదము. స్థలము చూపుము" అని చెప్పెను వర్తకుఁడు ఆనందించి వారి సత్యనిష్ఠకు ప్రశంసించి తన పొలమునకుఁ గొనిపోయి "ఇచ్చటఁ ద్రవ్వుఁడు" అని చెప్పి యొకచోటు చూపి "ఇట్లు సూక్ష్మములో మోక్షము ఉండవలయును"అని యానందించుకొనుచు ఇంటికిఁ బోయెను.

కుంభారు తొలుత "శ్రీహరీ"యని గునపము వేసి తట్టలో నికమట్టి యెత్తెను. ఆతని భార్య "పుండరీకాక్షా" యని గంప నెత్తిమీఁదఁ బెట్టుకొని పోయి అవ్వలఁ బాఱఁబోసెను. ఈరీతిగ నవారు శ్రీహరిని ధ్యానించుచు పని చేసిరి.

సాయంకాలము అగుచుండఁగా వర్తకుఁడు చేసిన పనినిఁ బరీక్షించుటకు వచ్చెను. కుంభారు వినయముతో అంతయుఁ జూపఁగా, ఇరువదిమంది చేయవలసిన పనిని ఇరువురు చేసినందులకు ఎంతయు ఆశ్చర్యపడుచు ఆనందముతో వర్తకుఁడు ఇంటికిఁబోయెను. మరునాఁడు మధ్యాహ్నమువఱకును కుంభారు భార్యతోఁగూడ అదే విధముగఁ బని చేయుఁగా అప్పటికి గంగాజలమువంటి నీరుపడెను. అదియు ఝురీవేగముతో రాసాగెను. అందులకు కుంభారు ఆనందించి "మాట యిచ్చినందులకు వర్తకునకు మనము ఋణము తీర్చుకొనఁగలిగితిమి" అని సంతృప్తుఁడై చెంత నున్న ఒక తియ్యమామిడిచెట్టుక్రిందఁ గూర్చుండెను. ఆతని భార్య ప్రక్కనే యుండెను. ఇరువురును హరిభజనము ప్రారంభించిరి.

వీరు ఇట్లు ఉండఁగా వర్తకుఁడు మఱల వచ్చెను. కుంభారు అప్పుడే భజనము మాని వర్తకునకు సకలమును నివేదించెను. ఆనీటి మాధుర్యమునకు వర్తకుఁడు పరమాశ్చర్యచకితుఁడై మహానందపరిపూర్ణచిత్తుఁడై యూరివారినందఱను రావించి సంగతి యానుపూర్వికముగ నెఱింగించెను. అందఱును ఆనీటి మాధుర్యమును జూచి రిచ్చవడి "ఇది

అమృతోపమానము. నీపుణ్యమువలన నిట్టిజలము పడినది. ఇది ఎన్ని దినములు వర్షము లేకున్నను ఎండిపోదు. ఈయూరి పొలములకు అంతయు ఈనీరు చాలును" అని ప్రశంసించిరి. తాము కష్టపడినందులకు వ్యర్థము గాలేదని కుంభారు మిగుల నానందించెను.

ఇది యంతయు ఇట్లు అగుచుండఁగా ఆతీరున ఆనందించుచు కుంభారు నూతిచెంత నిలిచియుండెను; గాని ఉన్నట్లు ఉండఁగా హఠాత్తుగ అచ్చటి భూమి క్రుంగిపోయెను. కుంభారుభూమిలోనికిఁబోయెను. అంతట ఆతని భార్య విలపించుచు అచ్చటకు రాఁగా అచ్చటివారెల్లరును కుంభారును బైటకుఁ దీయుటకుఁ బ్రయత్నించిరి; గాని ఆతఁడు ఎందును గాన్పింపఁడయ్యెను. ఇఁకఁ జేయునది లేక వారు కుంభారు భార్యను ఓదార్చి ఇంటికిఁ దీసికొనిపోయిరి.

పిదప ఆమె భర్తకొఱకు కొంతతడవు విచారించి తుదకు ఈభౌతిక ప్రపంచము గతియే యిట్టిదని మనస్సునకు సమాధానము చెప్పుకొని అత్యంతభక్తిశ్రద్ధలతో పాండురంగని మూఁడు అహోరాత్రములు ధ్యానించెను. అంత శ్రీహరి సాక్షాత్కరించి విచారము ఉడుపఁగా ఆమె అనేకవిధముల వినుతిసేసెను. అందులకు సంతోషించి స్వామి ఆమెకు అభయము ఇచ్చి "సాధ్వీ, నీకు విచారము వలదు. ఇఁక నొక్క సంవత్సరము అయినపిదప నీభర్త నుఱల భూవివరమునుండి వచ్చును. అంతవఱకును నీవు యథాపూర్వముగ నన్ను బూజించుచుండుము. పిదప నీభర్తయు నీవును గలిసి సేవించి ధన్యులయ్యెదరు. ఒక్క సంవత్సరము వఱకును భర్తృవియోగమును సహింపుము" అని పలికి తిరోహితుఁడయ్యెను.

అట పర్తకుఁడు అకారణము కుంభారు భూమిలో దిగఁబడిపోయినందులకు విచారించి ఆతఁడు దిగఁబడిపోయినచోట నొకమఠమును దాని చుట్టును చక్కని పూఁదోఁటయు నిర్మింపించెను. ఆబావి మధురజలమును త్రావుటవలన నాతనికి భక్తిజ్ఞానవైరాగ్యములు అలవడెను. మఱియు ఈవృత్తాంతము అంతయు వినియు ఆనూతియందలి మధురజలములను విడువఁజాలకయు అనేకభాగవతులు ఆమఠమున స్థిరనివాసములు ఏర్పఱుచుకొనిరి.

ఈతీరున పాండురంగఁడు ఏర్పఱిచిన గడువు ముగిసిన తరువాత

ఒకనాఁటిరాత్రి ఆయింతముముందు కుంభారుక్రుంగిపోయినచోట భూమి లోనుండి తాళములు మృదంగము మున్నగు వాద్యములు బోరుక లంగ హరిభజనము వినవచ్చెను. అది విని అచ్చటివారు ఎల్లరును ఆశ్చర్యచకితులై ఈవార్త గ్రామమున వెల్లడించిరి. తుదకు అది ఆ దేశమును ఏలురాజునకుఁగూడఁ దెలిసెను. తోడనే రాజు వింతపడి అనంతపరివారముతోఁగూడి వచ్చి అచ్చట త్రవ్వింపఁగా అడుగున శంఖచక్రాదిసకలాలంకారములతోడను ఒప్పుచున్న బంగరుకృష్ణవిగ్రహమును దాని ముందు తాళములు వాయించుచు పాటలుపాడుచు హరిభజనసేయుచు కూపాకుంభారును ఉండిరి. రాజు ఆసంభవమును జూచి కుంభారు మహిమకు చాల నబ్బురపడి తోడనే యతని పాదములమీఁద వ్రాలి "మహాత్మా, రక్షింపుము" అని ప్రార్థించెను. అచ్చటివారు ఎల్లరునుగూడ కుంభారుపాదములమీఁద వ్రాలి రక్షణమును వేఁడుకొనిరి. భక్తుఁడువారి నందఱను ఆశీర్వదించుట అగునప్పటికి వర్తకుఁడు వచ్చి భక్తుని కాళ్ల మీఁద వ్రాలి సాష్టాంగనమస్కారములు ఆచరించి "మహాత్మా, ఏలినవారి మాహాత్మ్యమును దెలిసికొనఁజాలక నీచమైన పని చెప్పి మిమ్ము నను నొప్పించితిని. ఈనూతిజలము త్రావిన పిమ్మట నాకు జ్ఞానము కలిగినది. ఎంతచేసినను నేను చేసిన పాపము పోదు. అది తమయనుగ్రహమువలననే పోవలయును. కావున అనుగ్రహించి రక్షింపవలెను." అని ప్రార్థించెను. భక్తుఁడు ఆతని నాదరముతో లేవనెత్తి "మహానుభావా, విచారమువలదు. నీవు చేసిన అకృత్యము ఎద్దియును లేదు. నీయనుగ్రహమువలననే నాకు ఈయదృష్టము గలిగినది. నీయనంతకరుణవలన నేను ఒకసంవత్సరము శ్రీహరితో ఏకాంతవాసము చేసి బ్రహ్మానందమును అనుభవించితిని. నీమీఁద ఈశ్వరునకు అనుగ్రహము గలుగు" నని పలికెను.

పిమ్మట రాజు "ఈతఁడు మానవమాత్రుఁడు గాఁడు" అని చెప్పి ఆందోళికమీఁద నాతనిని మనోహరమగు విమానముమీఁద శ్రీకృష్ణ విగ్రహమును ఎక్కించి యుక్తస్థలమునకుఁ గొనిపోయి పిడియించెను. ఇంతలో కుంభారుభార్య వచ్చి భర్తకు సాష్టాంగనమస్కారములాచరించి నిలువఁగా ఆతఁడు ఆమెను దీవించి "నీవు భగవానుగ్రహమునకుఁ బాత్రురాలవు అయ్యేదవు" అని చెప్పెను. అప్పుడు ఆమె తన

స్వప్నవృత్తాంతము అంతయు నివేదింపఁగా కుంభారు ఎంతయు ఆనందించెను.

తరువాత ఆరాజు తన పట్టణమున ఒక గొప్పఆలయమును గట్టించి అందు శ్రీకృష్ణవిగ్రహమును బ్రతిష్ఠచేసి ఆసమీపమునందే ఒకమఠము కట్టించి అందు కుంభారును భార్యాసహితముగా నిలిపెను. మఱియు నాతఁడు శ్రీకృష్ణపరమాత్మను సేవించుటకును కుంభారువలన జ్ఞానోపదేశమును బడయుటకును ఏఁగుదెంచు భాగవతులుమున్నగువారికిని శ్రీకృష్ణునకును ఏమియు లోపములు ఒదవకుండునట్లు నలసిన ద్రవ్యమును దానిని యుక్తమార్గములయందు వెచ్చించుటకు కొందఱు ఉద్యోగులను నియమించెను. కొన్నిదినములు గడచినతరువాత రాజు సంపూర్ణముగ జ్ఞానవైరాగ్యములనుబొంది కుంభారు పాదములను బట్టి "అనుగ్రహింపవలయును" అని ప్రార్థించెను. కుంభారు కరుణాళుండై రాజునకు శ్రీకృష్ణమంత్రమును ఉపదేశించి దాని క్రమమంతయు నెఱింగించి ఆశీర్వదించెను.

మఱి కొన్నిదినములకు వర్తకుఁడు భార్యాద్వితీయుఁడై అచ్చటకువచ్చి కుంభారునకు సాష్టాంగనమస్కారములు ఆచరించి "మహానుభావా, మేము ఇంతవఱకును సంసారసాగరమునఁ గూలి దరిఁగానక పరితపించితిమి. ఇప్పుడు మాకు పశ్చాత్తాపము గలిగినది. మాయెడలనను గ్రహించి పూర్ణ పరమ మోక్షప్రాప్త్యుపాయము నెఱింగింపుము" అని ప్రార్థించిరి. కుంభారును వారికి పరమభక్తిజ్ఞానవైరాగ్యములు అలవడినందులకు ఆనందించి వారికి మంత్రోపదేశము చేసి "భగవంతునకు మీయెడల అపారకరుణ కలుగును" అని యాశీర్వదించెను. పిదప అనేకులు వచ్చి ప్రతిదినమును కుంభారువలన ఉపదేశములు పొందసాగిరి.

కుంభారు చేయు భజనకు మెచ్చి కొన్నిదినములకు శ్రీహరి సాక్షాత్కరించి "వత్సా, నీభక్తికి మెచ్చితిని. నీవు నాకు అంతరంగభక్తుఁడవు. ఏమికావలయునో కోరుకొనుము" అని చెప్పెను. కుంభారు పరమానందభరితుఁడై అనేకవిధములఁ గొనియాడి "భక్తవత్సలా, సనకసనందనాదులకుఁ గూడ దుర్లభుఁడవు అగు నీవు సాక్షాత్కరింప నిఁక నాకుఁ గావలసినది ఏమి ఉన్నది! లోకము మాయావరణమునఁ గూలియున్నది. దానికితరణోపాయమును అనుగ్రహింపుము" అని ప్రార్థించెను. "అందు

లకు నీవే తగినవాఁడవు. నీకోరిక యెప్పుడును వృథగాదు" అని చెప్పి భగ
వంతుఁడు అంతర్హితుఁడు అయ్యెను. కుంభారుఁడు బ్రతికియున్నంతకాల
మును అనేకులను భక్తిజ్ఞానవైరాగ్యసంపన్నులను గావించి అవసాన
మున భార్యతోఁగూడ శ్రీహరి సాయుజ్యమును బడసెను. అవసానము
నకుఁ బూర్వము కుంభారునకు మఱియొకప్పుడు స్వామి సాక్షాత్కరించి
"వత్సా, నీనివాసమువలన ఈనగరము పుణ్యక్షేత్రములలో నొకటి
యైనది; ప్రతిసంవత్సరమును ఆషాఢకార్తికమాసములయందు నన్ను
సేవించుటకు పండరిపురమునకు వచ్చు భక్తులందఱును ఇక్కడకుఁ
గూడ వచ్చి పోవుచుందురు" అని చెప్పెను. ఇప్పటికిఁగూడ అట్లే జరు
గుచున్నది.

శా. "బృందారణ్యతపస్వినీమణులు గోబృందాంగనాశ్రీలకున్
నందానీకముఁ గాంచుచుందు పరమస్వచ్ఛందమా తేజమా
నందబ్రహ్మము నందనందనుఁడు నీనాదానుమోదంబు నా
యుందుఙ్ నిల్పదఁ జింపఁజూచెను పయోజాక్షుంబు మేఘాంశమున్."

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 21.)

---

# 47. శ్రీరామకృష్ణపరమహంస.

శ్లో. "న చ మమ ముకుందో మాద్రియాస్త్వం నిగమాన్తేషు నితాంతచారఖిన్నాః,
విచినుత భవనేషు వల్లవీనాముపనిషదర్థములూఖలే నిబద్ధమ్"

(కృష్ణకర్ణామృతము. ఆ. 2. ప. 28.)

వంగదేశమునందలి కామార్పుకర మను గ్రామమున కుదీరాంచటర్జీ
అను నొకవైదిక బ్రాహ్మణుఁడు ఉండెను. ఆతనికి ముగ్గురుకుమారులు
గలిగిరి. వారిలోఁ గడగొట్టువాని పేరు గదాధరుఁడు. అయిదేండ్లప్రా
యము వచ్చిన తరువాత తల్లిదండ్రులు ఈతనిని యథాశాస్త్రముగ అ
క్షరాభ్యాసముగావించి బడికిఁ బంపిరి; గాని అక్షరజ్ఞానము గలిగినతరు
వాత గదాధరుఁడు గ్రంథములను జదువుటకుఁ జాల నసహ్యముచూపఁ

దొఱఁగెను. అందులకుగారణమేమన? ఆతనికి లౌకికవిద్యలయందు అభి
లాషలేకుండెను. అంతటి చిన్నతనమునఁ గూడ నాతనికి భగవద్భక్తి
గలిగియుండవలయు నను పేరాస యుండెడిది. అందుల కుదాహరణ
ముగ నాతఁడు ఎల్లవేళలయందు ఏకాంతముగఁ గూరుచుండి భగవం
తుని ధ్యానించుచుండెడివాఁడు. ఇదిచూచి అన్నలును, తల్లిదండ్రులును
జాలిఁగోపించి పాఠశాలకు వెళ్లవలసివచ్చు నని యిట్లు మాయలు
చేయుచున్నాఁడని తలంచి బలవంతముగాఁ దీసికొనిపోయి పాఠశాలలో
గూలవేసి వచ్చుచుండిరి. ఎన్నివిధములఁ బ్రయత్నించినను ఆతఁడు పుస్త
కము ముట్టడయ్యెను. అందులకు విసిగి ఆతనిని అన్నలలో నొకఁడు
రక్తము కక్కునట్లు చేసెదనని భయపెట్టెను. పదినాలుగైదుదినములు
గడచునప్పటికి గదాధరుఁడు ఏకారణముననో రక్తముకక్కెను. తుదకీతని
తల్లిదండ్రులు ఈతనిచేష్టలకు విసిగి కలకత్తానగరసమీపమున నున్న
దక్షిణేశ్వరమను గ్రామమునకుఁ బంపి యచ్చట కాళికాదేవిగుడిలో
అర్చకునిగా నేర్పఱచిరి.

కాళికాలయమునఁ గూడ నాతనికి ఆత్మజ్ఞానసాధనమును గుఱించిన పరితాపమే పీడింపసాగెను. కొన్నిసమయములయం దాతఁడు దేవి పూజను మఱచి గర్భాలయము సొచ్చి క్రిందఁబడి దొరలుచు "తల్లీ, మానవుని ఆయుర్దాయము అల్పము. జ్ఞానము చిరకాలసాధ్యము. ఇట్లు చేసియు భగవంతుఁడు జ్ఞానరహితునకు నరకము విధించినాఁడు. కష్టా! నాజీవితము తరిగిపోవుచున్నది నీవేల కనుఁగొంపవు? నాకేమియువలదు. ఆత్మజ్ఞానతృష్ణ నన్ను దహించివేయుచున్నది. లోకజననీ! నాదాహము తీర్పవా?" అని పరితపించుచుండెను. ఇట్లు అనేకదినములు గడచిపోయెను. ఒక్కొక్కపు డాతని కీవిచారమున రాత్రింబవళ్లు తెలియకయే గడచిపోవుచుండెడివి.

ఈషణత్రయము మోక్షసిద్ధికి ప్రతికూలములు. దానిచే నెవరి హృదయములు పూరితములై యుండునో వారికి జ్ఞానసంపాదనము శశవిషాణమువంటి దగును. తల్లిదండ్రులు బాల్యముననే పెండ్లిసేయుట వలన గదాధరునకు శారదాదేవి యను భార్య యుండెను ఆత్మజ్ఞానమును బడయవలయునని యాతని కెప్పుడు తోఁచెనో అప్పుడే స్త్రీలను జూడ రాదు అనుసంకల్పము గూడ గలిగెను. అట్లే "నేఁటినుండియొకకాసై

నను ముట్టుకొనఁగూడదు" అని యాతఁ డొకనాఁడు శపథము చేసికొనెను. పిదప నాతని బీదతనముఁ జూచి యనేకు లాతనికి అయాచితముగ ధనము నొసంగఁ జూచుచుండిరి; గాని యాతఁడు ఒక్క కాసైనను స్వీకరించి యెఱుఁగఁడు. కొందఱు ధనికులు ఆతనికి ఎట్లయినఁ దమధనము నొకింత యిచ్చి తీరవలయు నని దీక్షఁదాల్చియుండిరి. వారు ఆతఁడు తెలిసియున్నఁ బుచ్చుకోఁడని తలంచి సమాధిలో నున్నపుడు ఆతని చేతిలోనో కాలిమీఁదనో పెట్టెడివారు; గాని యానాణెములు తీసివేయునంతదనుక నవి యెచ్చటనుండెడివో యాచోటు గజగజవడఁకిపోవుచుండెడిది. పిదప నాతఁడు వివాహబంధమును ద్రెంపుకొనఁదలఁచెను. గాని భారతీయుల వివాహబంధమునకు విచ్ఛేదము లేదుగదా? ఇది యెఱింగి యాతఁడు శారదాదేవిచెంతకుఁ బోయి దోసిలి యొగ్గి "మన దాంపత్యబంధనమును ద్రెంపివేయుము. నాకు ఐహికవాంఛ లేమియు లేవు. నీవు నాకు ఈవర మిచ్చితివేని సుఖించెదను" అని ప్రార్థించెను. అంత నామె మాఱు పలుకక భర్తకోరికను నెఱవేర్చి తాను సన్న్యాసిని యయ్యెను.

పిదప నాతఁడు పరతత్త్వజ్ఞానమునకై చేసిన పరిశ్రమ మనంతము. ఆతఁడు అన్నిమతములవారి యుపాసనాపద్ధతులను దెలిసికొనియెను. అన్నిమతములరహస్యములను దెలిసికొనెను. సకలము నాతఁ డాదరించెను. "భారతీయులు, మహమ్మదీయులు, క్రిష్టియనులు, బౌద్ధులు మున్నగువారు అందఱును గూడ ఆపరబ్రహ్మముకొఱకే వెదకుచున్నారు; గాని విశ్వాసములు వేఱు. మార్గములు వేఱు. అయిన నేమి? ఫల మొక్కటియే. ఉపాధిభేదమువలన రుచిభేదము గలిగినట్లే జాతిభేదముల ననుసరించి మతభేదములు గలిగినవి. ఇది ప్రకృతి విరుద్ధము గాదు. ప్రపంచమంతయు నద్వైతమును ఘోషించుచున్నది. ప్రపంచము నెఱుఁగనివారు భేదమును, ద్వేషమును బెంచెదరు" అని యాతఁడు నిశ్చయించుకొనియెను.

ఇట్లుండఁగా గదాధరుఁడు సన్న్యసించి పరమహంసరామకృష్ణుఁ డయ్యెను. అప్పుడు కలకత్తానగరమున కేశవచంద్రసేనుఁడు అనునొక జ్ఞానాస్తిఁడు పరమహంస నాశ్రయించి జ్ఞానభిక్షమును వేఁడెను. ఆతనికిఁ దొలుత రాజారామమోహనరాయి యేర్పఱిచిన బ్రహ్మసమాజముసఁ జాల నాసక్తి యుండెను. అగుటచేఁ గొంతకాల మాతఁడు పరమహంస

వలన జ్ఞానోపదేశమును బడసి పిదప నిది మంచిమార్గము గాదు" అని నిశ్చయించుకొని సాధారణబ్రహ్మసమాజమునకుఁ బునాదివేసెను; గాని యీతనివలననే పరమహంసశక్తిసామర్థ్యములు ప్రఖ్యాతములయ్యెను. పిదప వివేకానందుఁడు పరమహంస నాశ్రయించి యఖండజ్ఞానమును బడసి గురూపదేశమును దిరస్కరింపక దానిని పాశ్చాత్యులకు విప్పిచెప్పి అద్వైతమతప్రాముఖ్యమును ధ్రువపఱుచుట అందఱకును దెలిసినదియే.

పరమహంస యుపదేశమువలన ననేకులు తరించిరి. అద్వైతమతము మఱల నున్నతస్థితికి వచ్చెను. ఆతఁడెంతసేపును "తర్కశాస్త్రముతోఁ బనిలేదు. వేదాంతశాస్త్రచర్చలతోఁ బనిలేదు. జ్ఞానముమీఁద తఱుగని ఆశ, పరతత్వమును దెలిసికొనుటలో నత్యాసక్తి, సాధన, దీక్ష మున్నగునవి యున్నఁ జాలునని యుపదేశించుచుండెను. ఈ కాలమున భారతజాతికి రామకృష్ణుఁడు చేసినమహోపకారము శతసహస్రయుగములయందైనను మఱువరానిది. తమమతమునందు అధికాభినివేశముగల పాశ్చాత్యులలో ననేకులు రామకృష్ణునిమతమును, ఉపదేశములును విని మహానందముతో నాదరించిరి. ఆతని ప్రజ్ఞ యెల్లరిచేతను గొనియాడఁబడెను. రామకృష్ణుఁడిట్లు చిరకాలము లోకము నుద్ధరించి ప్రపంచధర్మము ననుసరించి నశ్వరమగు దేహమును విడిచి పరబ్రహ్మసాయుజ్యమును బడసెను.

సీ. "పరధర్మకామార్థపరత కాములై విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు చేరి కాంక్షించువారికవ్యయ దేహమిచ్చు నెవ్వాఁడు కరుణ
ముక్తాత్ము [illegible] లెవ్వాని మునుకొని చింతింతు రానందవార్ధి మగ్నాంతరంగు
లేకాంతు [illegible] నేమములఁ [illegible] చరిత్రం [illegible] నుంగు
గీ. [illegible]
బ్రహ్మమయునై [illegible] ప్రభు [illegible] భజింతు."
(భాగ. స్కంధ. 5. ప. 83)



# 48. నివేదిత.

శ్లో. "తమసి రవి రివోద్య న్మజ్జతా మంబురాశౌ
ప్లవ ఇవ తృషితానాం స్వాదువర్షీవ మేఘః,
నిధి రివ విధనానాం దీర్ఘతీవ్రామయాణాం
భిషగివ కుశలం నో దాతు మాయాతు శౌరిః."

(కృష్ణకర్ణామృతము. ఆ. 3. శ. 79.)

ఐరోపాఖండమున వాయవ్యభాగమున నున్న బ్రిటిషుద్వీపములలో నొకటియగు ఐర్లండు అను ద్వీపమున "రెవరెండు, యస్, ఆర్. నోబుల్" అను నొక మహాజనుడు ఉండెను. ఆతఁడు పెద్దవాఁడు అయిన తరువాత మాంచెష్టరు పట్టణమున ఒక ధర్మబోధకుఁడుగా నేర్పఱుపఁబడెను. ఆతఁడు చాల మంచివాఁడు "మార్గరెటునోబుల్" అనునామె ఆతనిక ముద్దులకూఁతురు.

ఈకొమార్తె యనిన నాతనికి ఎంతో ప్రేమ. ఎట్టి చిక్కుసమయమునందైనను ఎట్టి విచారసమయమునందు అయినను ఆమెనుజూచి నచో ఆనందము వచ్చెడిది. తండ్రియెడల ఆమెకు విశేషమైన భక్తి గలదు. ఆమె తండ్రి గౌరవమును బాగుగ గ్రహించెను. ఆతఁడును ఆమె ముఖమున తాండవము సేయు తేజస్సును గాంచి "ఈమె మహాత్మురాలు అగును" అని తలంచుచుండెడివాఁడు. మఱియు నాతఁడు కూఁతునకు చాల శ్రద్ధతోఁ జదువుచెప్పను. ఆమె చిన్నతనమున ఆతఁడుమాంచెష్టరునగరమున బీదజనులకు అనేకులకు అనంతసాహాయ్యముచేయుచుండెను. అగుట నాతని కొమార్తకు అట్టి పరోపకారగుణమే పట్టువడెను. కొన్నిదినములకు ఆతనికి మరణము సమీపించెను. మరణకాలమున ఆతఁడు తనభార్యను జూచి "మార్గరెట్ ముందుముందు చాల గొప్ప పనులంజేయును. నీవు అప్పుడు ఆమెకు అడ్డుసెప్పక అడ్డంకులు గలిగింపక చేయఁబూనిన పనియందు విశేషమైన ప్రోత్సాహమును గలిగింపుము" అని చెప్పిపోయెను.

కొన్నిదినములకు ఈమె లండనుపురమునఁ బ్రవేశించెను. అచ్చటఁ గొందఱు పండితులు స్త్రీవిద్యావిషయమునఁ గ్రొత్తమార్గములను గనిపెట్టి వానినిఁ బ్రకటించిరి. ఈమె ఆపద్ధతులను బాగుగ గ్రహించి అందు చాల ప్రయోజనములు గలిగించు చిహ్నములు ఉండుటచే

వానిని అంగీకరించి, ఆపద్ధతులతో ఒక పాఠశాలను స్థాపించి దానికి తానే అధీశ్వరియై నడుపసాగెను. ఈకాలమున నీమె అనేకులకు అనేక విధముల సాహాయ్యము చేసెను.

ఇంతలో అనేకుల కోరికమీఁద శ్రీరామకృష్ణపరమహంసశిష్యుఁడగు వివేకానందస్వామి ఇంగ్లాండునకు వచ్చెను. ఆతఁడు భారతధర్మమును గుఱించియు, అద్వైతమతమును గుఱించియు అనేకోపన్యాసములు నిచ్చెను. మార్గరేటు అన్ని యుపన్యాసములను వినెను. వివేకానందునియెడల చాల గౌరవభావమును జూపసాగెను. గాని యాతఁడు బోధించు మతమును మాత్రము ఆమె అంగీకరింపలేదు ఆమె స్వామి మతమును కొలుత గౌరవింపలేదు ఇంతలో స్వామి భారతదేశమునకు వచ్చి యొకసంవత్సరము మాత్రము ఉండి మఱల ఇంగ్లాండునకుఁ బోయెను. ఈలోపుగా నామె వివేకానందుని మతమును గుఱించి అనేక విధములజర్చించుకొని "ఇందుఁ గొంతగాకున్న గొంతయైనయాథార్థ్యము ఉండకపోదు" అని సంశయగ్రస్తయయ్యెను. ఇంతలో మఱల స్వామి యుపన్యాసములను వినుట తటస్థించెను. ఈసంభవమువలన ఆమెకు స్వామియందేగాక స్వామిమతమునందుఁగూడ గౌరవభావముగలిగెను. గాని అప్పటికిఁ గూడ ఆమె తన మతమును విడువలేదు.

ఇట్లుండఁగా వివేకానందుఁడు ఒక దినమున "మా దేశపుస్త్రీల వృద్ధిని గుఱించి కొన్ని యాలోచనములు చేసితిని. ఈప్రయత్నమున నీవు చేయూత నిచ్చి వారి నుద్ధరించెదవా!" యని ఆమె నడిగెను. తోడనే సందేహింపక ఆమె యందులకు అంగీకరించి స్వామివెంట భారతదేశమునకుఁ బ్రయాణము అయ్యెను.

భారతదేశమునకు వచ్చినపిదపఁ గూడ నామె ఇంకను వివేకానందుని మతమును గుఱించి యోచించుచునే యుండెను. ఒకప్పుడు ఆమె తన స్నేహితురాలియింటనుండి ఆమెతో ఈవిషయమును గుఱించియే ప్రస్తావన సేయుచుండఁగా నచ్చటకు స్వామి వచ్చెను. అప్పుడు స్వామి ముఖమున ఆమెకు ఏదో యనిర్వచనీయమగు దివ్యతేజము గాన్పడ గట్టెను. తోడనే యామె మోఁకరించి నమస్కరింపఁగా స్వామి ఆదరముతో శిరముపైఁ జేయిడి ఆమెను ఆశీర్వదించెను. స్వామి హస్తస్పర్శవలన ఆమెశరీరము పులకాంకితము అయ్యెను. భావయంత్రము కదలి

పోయెను. సందేహములు సమూలముగ నాశనమై పోయెను. అప్పుడామెకు నూతనజీవనము ప్రారంభము అయ్యెను. అనఁగా ఆమెకు భారతీయత్వము ప్రాప్తించెను.

ఆమె అప్పుడు వివేకానందుని మాహాత్మ్యములను బాగుగ గుఱు తెఱిఁగెను. ఏమన? ఒకప్పుడు ఆమె రామకృష్ణపరమహంస వివేకానందునిఁ గుఱించి "ఈతని హస్తస్పర్శవలననే దివ్యజ్ఞానము గలుగును" అని చెప్పియున్నట్లు వినియుండెను. అందులకు దార్ఢ్యముగా నీమె "నేను ఆమహాత్ముని పాదములు ఎప్పుడు స్పృశించితినో అప్పుడే నాకు బ్రహ్మజ్ఞానము కలిగినది" అని చెప్పి గురుదేవునియెడల చాలభక్తి శ్రద్ధలతో సంచరింపసాగెను.

పిదప ఆమె రామకృష్ణపరమహంసశిష్యబృందమునఁ జేరెను. హృదయమును మార్చుకొనినట్లే ఆమె "మార్గరెటునోబుల్" అను నామము "నివేదిత" అని మార్చుకొనెను. తన్ను దానే భారతధర్మమునకు నివేదించుకొనినది; గావున నీమె ఈపేరు గ్రహించెను. పిదప నీమె వివేకానందస్వాముల శిష్యురాలు అయ్యెను. అందఱును ఈమెను "నివేదితాసోదరి" యని పిలువసాగిరి.

మతవిషయికములు అగు చింతలు అన్నియు మానినతరువాత ఈమె వివేకానందుఁడు తొలుత తన్ను ఈదేశమునకు ఎందులకు ఆహ్వానించెనో ఆపని సేయుటకుఁ బూనఁదలఁచెను; గాని అందులకుఁగాను నివేదిత కులీనస్త్రీలనడుమ నుండవలయు నని నిశ్చయించుకొనెను. అందును బ్రాహ్మణుల మధ్య నుండఁదలఁచెను. అగుట నీమె ఈప్రయత్న సాఫల్యముకొఱకు కొన్నిదినములు కష్టపడవలసివచ్చెను. తుదకు ఎట్లు అయినను ఆకోరిక నెఱవేర్చుకొనెను. కాని మఱియొక కష్టము ప్రాప్తించెను. ఈమెకు వంటవాండ్రవలన కష్టములు సంభవించెను. తెలిసి తేటలు గల వంటవాండ్రు తొలుత లభింపరైరి. లభించినను స్వల్పముగ నుండిరి. మాటిమాటికిని మాఱిపోఁజొచ్చిరి. కొన్నిదినములయందు ఈమెకు ఎట్టివాండ్రైనను వంటవాండ్రు లేకపోవుచుండిరి. అప్పుడెల్ల నీమె ఏపండ్లో ఏపాలో పుచ్చుకొని దినములు గడుపసాగెను. ఒక్కొక్క నాఁడు ఇరుగుపొరుగు స్త్రీలు ఈవార్త విని సకరుణలై అన్నాదికములు పంపఁగా నీమె కృతజ్ఞతతో వానిని స్వీకరించి భక్షింపసాగెను.

కొన్ని దినములు గతించిన తరువాత నీమె స్వయముగ తన యింటిముంగిట వీధిని తుడుచుకొనఁ జొచ్చెను. అదిచూచి ఆయిరుగు పొరుగు స్త్రీలెల్లరును తాము స్వయముగ ఆపనికిఁ బూనుకొనకున్నను సేవకులచేనైనను శ్రద్ధగా చేయింపసాగిరి. ఈకారణమువలన అంతకు మున్ను చాల మురికితోఁ నిండియుండెడి బోసపారా అనుపేరుగల ఆవీధి చాల శుభ్రముగా నుండుచుండెను.

తరువాత నీమె స్త్రీలకు జ్ఞానము నొసంగుటకుఁ దలపెట్టెను. భారతదేశములో ప్రకృతము ఆచరణలో నున్న విద్యావిధానము కేవలము నిరుపయోగము. అగుట నామె అది కనిపెట్టి క్రొత్తపద్ధతితో తొలుత బాలికలకు చదువుచెప్పుటకుఁ బ్రారంభించెను. ఇది ప్రయోజనకరము అగుచుండుటఁ జూచి కొన్నిదినములు కడచినతరువాత ఆవీధిని సమీపవీథులయందును గలఇరుగుపొరుగు గృహయజమానురాండ్రు గూడ తీరికయైనపుడు వచ్చి ఆమెవలన విద్యాదానమును బడయుచుండిరి. ఈతీరున తొలుత ఇంటినిఁగుదురనీయకయు వంటలక్కను గుదురనీయకయు ఆమె ననేకవిధముల బాధపెట్టిన స్త్రీలు అందఱును ఆమెకు శిష్యురాండ్రు అయిరి. వారికి ఆమెను క్షణము విడిచియుండుట గూడఁ గష్టముగాఁ దోఁచుచుండెను. ఆమె మంచితనమే ఆమెకు ఇట్టి విజయమును గలిగించెను.

భారతస్త్రీలను ఉద్ధరింప వ్రతముపూని ఈవిషయమున అనఁగా తల పాఠశాలలకు స్త్రీలనుదీసికొనిరావలసినదని ఈమె తొలుత డాక్టరు బోసుగారి భార్యను సాయము గోరెను. ఆమె నివేదిత ప్రార్థనమును త్రోసివేయక కొంత ప్రయత్నించెను; గాని ఆవంతయు ఫలము గలుగదయ్యెను అంతట నామె విసిగిపోయి "ఈవిషయమున నావలన నేమియుఁ గాలేదు" అని చెప్పియుండెను. అగుటచే నివేదిత ఇప్పుడు ఆమె నొకనాఁడు తన యింటికిఁ గొనివచ్చి ఇరుగుపొరుగు స్త్రీలు అనేకులు చదువుకొనుచుండుటఁ జూపెను. అది చూచి బోసుగారి భార్య మిగుల వింతపడి సిగ్గుపడెను. నివేదిత స్త్రీలకు విద్య చెప్పుటతో మాత్రమే తృప్తి వహింపలేదు. ఆమె అనాథశిశువులకు ఆశ్రయము ఇచ్చెను; బాలవితంతువులను ఆదరించెను; అనేకవితంతువులను ఉపాధ్యాయురాం

ద్రనుగాఁ దయారుచేసెను ఇన్ని సత్కార్యములు చేయుచుండుటవలన నివేదిత ఏర్పఱిచిన పాఠశాలకు సోదరీబృందము అని పేరు వచ్చెను.

ఈసోదరీబృందవిషయమునునివేదితవృత్తాంతమును దేశదేశములయందు వెల్లడి యయ్యెను. అగుటచే కలకత్తాకు వచ్చిన భారతీయులలో ననేకులునుభారతదేశమును జూడవచ్చిన పాశ్చాత్యులనేకులును ఆమెను జూచిపోవుచుండిరి; గాని ఆమె ఈయాశ్రమనిర్వహణార్థము ధనము ఈయవలసినదిఅని ఎవరినిఁ బీడించి ఎఱుఁగదు ఆమెతఱుచుగ గొప్ప గొప్పపత్రికలకు మంచిమంచి వ్యాసములను వ్రాసి పంపుచుండెడిది. ఈవ్యాసములకు ఆయా పత్రికాధిపతులు వెల ఇచ్చుచుండిరి. ఇదియుఁ గాక ఆమె అనేకమహావిషయములను గుఱించి అనేకగ్రంథములను వ్రాసి ప్రకటించెను ఈగ్రంథప్రకటనము వలనఁగూడఆమెకుఁ జాల ధనము వచ్చుచుండెడిది ఈతీరున సంపాదించిన ధనము అంతయు ఆమె ఈయాశ్రమమును బోషించుటకే వినియోగించుచుండెడిది.

ఆమె కలకత్తాలోఁ బ్రవేశించిన కొలఁది దినములకే ఆనగరమున ప్లేగుజాడ్యము చెలరేఁగెను నగరమునందలివారు ఎల్లరును అదలిపోయిదిక్కు తెలియకుండఁబోనసాగిరి. కలకత్తాకుఁ జేరెడి యోడలును రైలుబండ్లును శూన్యములగుచుండెను; గాని కలకత్తానుండివివిధ ప్రాంతములకుఁ బోవునవి మాత్రము క్రిక్కిరిసిపోవుచుండెడివి. అనేకులు ఇట్లు పాఱిపోవుచుండఁగా అనేకులు ఇష్టము లేకయు నీళ్లులేకయు మఱి యితరకారణములవలనను నగరమునందే నిలిచిపోయిరి. వారిలో ననేకులు మృత్యువువాతఁ బడసాగిరి. నివేదిత యప్పుడు విసుగును విరామమును భయమును లేక నగరము అంతయు దిరుగుచు చేతనైనంతవఱకును ప్లేగు సోకినవారికి ఉపచారములు సలహాలుచెప్పుట మందులు ఇచ్చుట మున్నగునవి చేయుచుండెడిది. ఒకప్పుడు ఒకబీదస్త్రీ తనతల్లి ప్లేగువలననే చచ్చిపోయియుండఁగా ఏడ్చుచుండెను అప్పుడే ఆమెకుఁ గూడ జాడ్యము అంకురించెను. తోడనే నివేదిత ఆమెకుఁ జికిత్స ప్రారంభించెను; గాని కొలఁదిసేపటికి నివేదిత యొడియందే ఆమె ప్రాణములు విడిచెను. ఈతీరున నివేదిత శక్తివంచనలేకుండ ననేకులకు సేవ సేసి కొందఱను మాత్రము బ్రతికింపఁ గలిగెను.

మఱికొన్ని దినములకు తూర్పు బంగాళా దేశమున తీరని కఱవు ప్రాప్తించెను. దీని వలన అనేక ప్రజలు మలమల మాడిపోయిరి. ఆ విపన్నుల నప్పుడు ఈమె నుఱల రక్షించుటకుఁ బ్రారంభించెను. ఈకార్యమున ఆమె నిద్రాహారములను మఱచి శక్తికిమించిన పని జేసి యనేకులను రక్షించెను: గాని యీమెపరోపకారపారీణతకు ఫలమో యనునట్లు ఆమెకు శీతజ్వరము సంభవించెను. ఈశీతజ్వరమువలన ఆమె చాలనలిగి పోయెను. రోగస్థితినిఁ జూచి అనేక దేశీయవిదేశీయవైద్యులును అనేక మిత్రులును ఈమెను ఆబోస్త్రాగావీథినుండి మఱియొక వీథికి బోవలసినదని చెప్పిరి; గాని ఆమె వినక అచ్చటనే యుండెను.

నివేదిత అనేకపత్రికలలో అనేకవ్యాసములు ప్రకటించియున్నది గదా? అట్లే యీమె కొన్ని గ్రంథములను గూడఁ బ్రకటించియున్నది. ఆమె వ్రాసిన గ్రంథము లందెల్ల ఆదిమము "కాళీమాత". ఇది కాళిక యొక్క తత్త్వము నంతను వివరించును. ఇందు మనలోఁ జాలమంది తలఁచునట్లు కాళిక యని నరబలులను జంతుబలులను గోరు మారణదేవత గాదని యీమె సహేతుకముగా నిరూపించి యున్నది. దీనిని ఇంగ్లాండు దేశమున ఒకపుస్తకవిక్రేత ప్రకటించెను. మఱియు నివేదిత వ్రాసిన మఱియొక గ్రంథము "భారతీయాచారముల యల్లిక" యనునది ఇందు మనయాచారముల ఘనత చక్కఁగ వివరింపఁబడి యున్నది. నివేదిత "స్వామిని నేఁ గన్నవిధము" అని మఱియొక గ్రంథము వ్రాసెను. అందు వివేకానందునకును తనకును పరిచయము అగుట మొదలుగ జరిగిన సంగతులు వ్రాసియున్నది. అజంతావిహారమునందలి ప్రతిమలను గుఱించి ఈమె వేఱొక గ్రంథము వ్రాసి యున్నది. అది భారతీయు లెల్లరును తప్పక పఠింపవలసిన గ్రంథము. నివేదిత శైలి యతిమధురము ఈమెకుఁగల విషయనిరూపణశక్తి అత్యద్భుతము. ఈమెకు వ్రాయుటయందు చెప్పుటయందునుగూడ సమానమైన అసమానశక్తియున్నది. ఈమె వ్రాసిన విషయములును చెప్పిన సంగతులను గూడ క్షణములో పాఠక చిత్తముల యందును శ్రోతల హృదయముల యందును అంకితములు అగును. ఇట్లు ఈమె అసమాన సామర్థ్యముతో పదునాలుగు సంవత్సరములు భారతదేశమునకు అనంత సేవను జేసి అవసానమున పరబ్రహ్మైక్యముఁ బడసెను.

మ॥ “అడవిం జీఁకటిఁ బోవువాని కుదయం బైనట్టి సూర్యాకృతిన్
జలధిం గ్రుంగఁగ నావ దగ్గిఱిన యోజం బేదకున్ లిబ్బి చొ
ప్పడుకిన్ దృష్టిఁ దీర్పఁగా జడిమొగుల్ పైకొన్న చందాన నొ
వ్వడరన్ మాన్పెడు వైద్యునట్లు హరి డాయన్ వచ్చినన్ బ్రోచుతన్.”

(కృష్ణకర్ణామృతము. ఆ.3. ప. 97)

---

# భద్రాచలరామదాసు.

బెజవాడకు సమీపమున నున్న నేలకొండ పల్లెయందు లింగన్న అను నొక బ్రాహ్మణుఁడు వసించియుండెను. ఆతని భార్యపేరు కామమ్మ. ఆదంపతులు అన్యోన్యప్రేమ సకలసుఖములు అనుభవించుచుండిరి; గాని వారికి సంతానసుఖముమాత్రము లేదయ్యెను. సంతానము నిమిత్తము లింగన్న చాలదినములు ఇందిరేశుని భజించెను. మఱికొన్నిదినములకు హరిపూజాఫలముగ కామమ్మ గర్భవతియై నవమాసములు మోసి ఒకమంచిలగ్నమున కుమారునిఁ గనియెను. లింగన్న కుమారునకు జాతకర్మాదులు నిర్వర్తించి గోపన్నఅని నామకరణముగావించెను.

శ్రీహరిప్రసాదమువలన జన్మించినవాఁడు; గావున గోపన్న మాటలాడ నేర్చినదిమొదలు ‘శ్రీహరీ’ యనియు, ‘శ్రీరామా’యనియు నెల్లప్పుడును పలుకుచుండెను. లింగన్న తన కొడుకు ఇట్లు దైవభక్తి కలవాఁడు అగుటకు ఆనందించి యుక్తసమయమున అక్షరాభ్యాసము గావించి విద్యాభ్యాసార్థము ఒక పండితునకు అప్పగించెను. అచ్చట గోపన్న తొలుఁదొలుత బాలరామాయణము చదివెను. అదిమొదలు ఆతఁడు రామనామస్మరణ తప్పకుండ నయ్యెను. కొలఁది దినములకే ఆతఁడు విద్దెలను నేర్చి ఇంటికిఁ జేరుకొనెను. విద్వాంసుఁడై వచ్చిన గోపన్నను జూచి తలిదండ్రులు మిగుల నానందించిరి; గాని మఱికొలఁది దినములయందే వారు దివమునకుఁ బోయిరి.

సంసారభారము గోపన్నమీఁదఁ బడెను. ఇరుగుపొరుగువారి బోధవలన ఆతఁడు ఒకమంచి కన్యను జూచి పెండ్లియాడెను. పెండ్లి

మైన కొన్నిదినములకు ఆమె కాఁపురమునకు వచ్చెను. దంపతులు ఇరువురును చాల అనురాగముతో మెలఁగసాగిరి. ఇట్లు కొలఁది కాలము గడచుసప్పటికి గోపన్నకు ఒకకుమారుఁడు గలిగెను. ఆతఁడు కుమారునకు రాముఁడు అని పేరుపెట్టి మిగుల గారాబముతో పెంపఁ దొడఁగెను. అప్పటికి గోపన్న వయస్సు రమారమి ఇరువదిసంవత్స రములు?

ఒకనాఁడు తంబుర శ్రుతిచేసికొని హరికీర్తనలు పాడుచు నొక హరిదాసుఁడు గోపన్న ఇంటిముంగిటకు వచ్చి నిలిచెను. తోడనే గోపన్న "ఎవరో మహానుభావులు వచ్చినారు" అని చింతించి వీథిలోనికి వచ్చెను. వెంటనే హరిదాసుఁడు గోపన్న లక్షణములను బరిశీలించి అద్భుతాశ్చ ర్యచకితుఁడై గగ్గతకు ఱమ్మని చేరఁబిలిచి "వత్సా, నీకు అఖండయో గము ఉన్నది. నీమీఁద శ్రీరామచంద్రునకు అఖండానుగ్రహము గలు గును. ఇఁక నీకు లేనిది యేమి గలదు? ప్రపంచమునఁ బుట్టినవారు ఎల్ల రును జచ్చి మఱల మఱలఁ బుట్టి మఱలమఱలఁ జచ్చుట ప్రకృతి ధర్మము. ఇది సామాన్యధర్మము. విశేషధర్మము గూడ నొకటి గలదు. అనఁగా పునరావృత్తి రహితశాశ్వత బ్రహ్మలోకనిత్యనివాసము. దీని ముఖ్యభావము ఈశ్వరసాయుజ్యము. మానవజన్మము ఎత్తినందులకు ఫలము ఈశ్వరసాయుజ్యమును సాధించుట. ఇదిసాధింపనిప్రాణి జన్మపరం పరచే యమయాతన ననుభవించును. ఇట్టియవస్థ రాకుండఁ జూచుకొ నుట వివేకి లక్షణము. ప్రపంచవాసనలను పరిహరింపఁజాలని వాఁడు ముక్తి పడయఁజాలఁడు. ఈజగత్తు అంతయు మిథ్య. శాశ్వతము గాదు. ఆత్మ యొక్కటే శాశ్వతము. అయినను మాయావరణము వలన ఆత్మ జ్ఞానము తిరోహితమై, జగత్తు యథార్థము అను మోహము ఎల్లప్రాణు లకును గలుగుచున్నది. ఎవరు ఈవ్యామోహమునఁ జిక్కుదురో వారికి మోక్షము లేదు. ఈవ్యామోహమును దొలఁగించుకొనుటకు ఆధా రము ఈశ్వరసేవ. శ్రీహరిని గొలిచినవారికి అక్షయానందము సిద్ధించు ను; గావున నీవు ఈసంసారము అసారము అని ఎంచుము. దానిని అంట కుము. తారకమంత్రమును జపింపుము" అని మంత్రోపదేశము చేసెను. ఆహరిదాసుఁడు కబీరుదాసు.

కబీరుదాసు వెడలిపోయినతరువాత గోపన్న తారకమంత్ర
మును తదేకనిష్ఠతో జపింపసాగెను. ఉన్నది ఎంతయో రావలసినది
ఎంతయో ఎఱుగకుండ తన ఇంటఁగల ధనము అంతయు బీదలకుఁ
బంచి ఈయసాగెను. సంతర్పణలమీఁద సమారాధనలు. దానముల
మీఁద ధర్మములు. ఇఁక వెనుకముందులు ఆలోచించుట లేదు. ఈతీరున
కొలఁది కాలము మాత్రమే జరుగునప్పటికే ఇంటఁగల సర్వస్వమును
అయిపోయెను. దినసాతమునకు కష్టము సంభవించెను. మధ్యాహ్నము
అరగడుపుతో లేచిన రాత్రికి మునలే లేకుండెను. ఇట్టి స్థితి సంభవించి
నను ఆతఁడు సంపాదనకుఁ బూనుకొనలేదు. అన్నము లేదే యని విచా
రింపలేదు. అన్నిటికిని రామనామస్మృతియే చాలును అని యాతఁడు
తదేకదీక్షతో నుండెను.

తొలుత నాతఁడు రామకోటి వ్రాసి ముగించి అందులకు సంత
ర్పణము ప్రారంభించెను. ఇట్లుండఁగా నొక యూరి నుండి యొక బ్రాహ్మ
ణుఁడు వచ్చెను. ఆతని నెంతో ఆదరించి గోపన్న సకలమును బ్రారంభిం
చెను. వంటలన్నియుఁ బూర్తి యయ్యెను. అనేకబ్రాహ్మణులు వచ్చి
వాకిటఁ బంతులుదీఱి కూర్చుండిరి. కొందఱు బ్రాహ్మణులు వడ్డనలు
సేయుచుండిరి. ఈసమయమున గోపన్న కుమారుఁడు అగు రాముఁడు
గంజితొట్టిలోఁ బడిపోయెను. వెంటనే తల్లి ఆబాలుని ఒడ్డుమీఁదికి
లాగివేసెను; గాని అంతకుముందే బాలుఁడు విగతప్రాణుఁడు అయ్యెను.
అయినను ఇప్పుడు తెలిసినచో బ్రాహ్మణ సమారాధనమునఁ దత్ప
రుఁడై యున్నపతి తత్తరపడి చేయుచున్నదాని మానివేయునని శంకించి
యూరకుండెను. కొంతసేపటికి బ్రాహ్మణులు తృప్తిగా భుజించిరి. అప్పుడు
గోపన్నకు ఈవార్త తెలిసెను. తోడనే యాతఁడు తనకుమారుని
మృతకళేబరము నెత్తికొని శ్రీరామచంద్రునిఁ దలంచి అతిఘోరముగ
విలపింపసాగెను. ఒకటి రెండు నిమిషములయందే ఆతనికి ఈదుఃఖము
పోయెను. "జగదీశ్వరుఁడగు శ్రీరామచంద్రుఁడు నాపాల నుండ నాకీ
దుఃఖమేల" అని తలంచి ఆతఁడు కాళ్లకు గజ్జెలు కట్టుకొని ఒకచేత
తంబురాధరించి ఒకచేత బాలుని మృతకళేబరమును ఎత్తుకొని శ్రీరా
ముని గుణగణములనుగీర్తించుచుమహానందముతోనృత్యముప్రారంభిం
చెను. కొంతసేపటికి బాలకుఁడు దీర్ఘనిద్రపోయి మేల్కొన్నవానివలె లేచి

కూర్చుండెను. అది చూచి అందఱును అత్యాశ్చర్యపడిరి. గోపన్న మహానందపరవశుండై శ్రీరామచంద్రుని మఱిలనేకవిధములఁ బ్రార్థించెను. భోజనమునకు వచ్చిన బ్రాహ్మణులు అందఱును భూరిసంభావనలు బడసి గోపన్నమాహాత్మ్యమునకు అబ్బురపడుచు వెడలిపోయిరి. ఈవిధమున అనేకపర్యాయములు సమారాధనలు చేయుటవలననే ఆతఁడు కడు బీదస్థితికి వచ్చెను. ఈస్థితిఁ జూచి భార్య వగచుచుండఁగా గోపన్న "కోలం, ఏలవగచెదవు? శ్రీరామచంద్రుఁడు ఉండఁగా మనకు ఏమిలోపము?" అని యామె నోదార్చెను.

అదిమొదలు ఆమె మఱల తనబీదస్థితిని దలంచుకొని వగచి యెఱుఁగదు. ఎల్లప్పుడును భర్తతోఁగూడ సత్యానందముతో శ్రీరామనామమును స్మరించుచు భర్తకు సకలోపచారములను జేసి సరివారిలో నామె మేలుబంతి అని పేరుబొందెను.

ఇంతలో నొక సంవత్సరము గడచి పోయెను. శ్రీరామజన్మోత్సవము సమీపించెను. అది తెలిసి గోపన్న "ఇంటఁ జూచిన నేమియు లేదు. శ్రీరామజన్మోత్సవమును బ్రతికియుండియు శక్తికొలఁది చేయక పోవుటకంటె అన్యాయము లేదు. ఇందులకు ధనము కావలయును గదా! గోల్కొండకుఁ బోయెదను. నేను పూర్వజన్మమున పుణ్యము చేసికొని యుంటినేని ఈయేటి మహోత్సవము జరుగుటకు తగిన అవకాశములు అక్కడ సంభవింపవచ్చును" అని నిశ్చయించుకొని గోల్కొండకు బయలు దేఱెను.

గోపన్న కొన్నిదినములకు గోల్కొండకు జేరుకొని అక్కన్నమాదన్నగార్ల ఇంటికిఁ బోయెను; గాని లోపలకుఁ బోవుటకు పహారా జవానులు అడ్డుపడిరి. అప్పుడు ఆతఁడు "నేలకొండపల్లె కాపురము తండ్రి లింగయ్య తల్లి కామమ్మ పేరు గోపన్న దర్శనమునకు సెలవుఁగోరుచున్నాఁడు" అని చెప్పుఁడు అని జవానులతో జెప్పెను. జవానులు లోపలకుఁ బోయి రాజ్యాంగమును గుఱించి ఆలోచించుచున్న అక్కన్నమాదన్నగార్లకు ఈసంగతులు తెలిపిరి. ఇది వినినతోడనే వారు దిగ్గన లేచి వీథిలోనికి వచ్చి మేనల్లుడు అగు గోపన్నను కౌఁగిలించుకొని ఆదరించి లోనికిఁ గొనిపోయి "వత్సా, నీతల్లియు, మా అక్కయునగు కామమ్మ స్త్రీలయందు మేలుబంతి. అట్టియామెను బ్రపంచమున మఱలఁ

జూడము" అని ఆమెను దలంచుకొని వగచిరి. అంతట గోపన్న "గత జలసేతుబంధనము వలనఁ బ్రయోజనము లే"దని వారికి తెలిపెను. పిదప వారు గోపన్న స్థితిగతుల నడిగి తెలిసికొని జరిగినదానికి ఎంత యువగచి నీకేమియు ఇబ్బందిలేదు. అంతకును శ్రీరామచంద్రుఁడును పిదపమేమును గలము" అని చెప్పి ఆతనికి ధైర్యముఁ గొలిపి భోజనానంతరము కచ్చేరికిఁ బోయిరి.

వారు ఇరువురును కచ్చేరికిఁ జేరుకొని తొందరపనులు అన్నియు ముగించుకొను సప్పటికి తానీషావచ్చి సలాములు చేసి "అమాత్యవరులు నేఁడు జాలము చేసినట్లు ఉన్నది. ఒకానొక పనివిషయము మీకొఱకు ఎదురుచూచుచున్నాము" అని పలికెను. అక్కన్న తను మేనల్లుఁడు వచ్చిన సంగతిఁ దెలుపఁగా తానీషా "వారిని మేము చూడవలయును" అని పలికెను; అంతట తానీషా యాజ్ఞప్రకారము ఒక సరదారుఁడు పాలకిని బట్టించుకొనిపోయి నవాబు సెలవు నెఱింగించి గోపన్నను ఆపాలకిలోఁ గోటకుఁ గొనివచ్చెను. అక్కన్నపోయి గోపన్నను గొనివచ్చి నవాబుదర్శనము చేయించెను. గోపన్న నవాబునకు వంగి సలాములు చేసి ఆశీర్వదించెను. పిదప నవాబు మంత్రుల వలన గోపన్న శక్తిసామర్థ్యములను విని ఆతనికి భద్రాచలము తాలుకాకు తహాసీలుదారీ ఉద్యోగము ఇచ్చి సబహుమానముగాఁ బంపెను. సాయంత్రము ఇంటికి వచ్చిన తరువాత అక్కన్న మాదన్నగారు మేనల్లునకు నీతులు ఉపదేశించి పాలకీమీఁద భద్రాచలమునకు సుఖునాఁడుపంపివేసిరి.

గోపన్న భద్రాచలము చేరిన సుఖునాఁడే అచ్చట అంతకుఁ బూర్వము తహాసీలు చేయుచున్న యాతఁడు అధికారము అంతయు గోపన్నకు ఇచ్చివేసెను. పురజనులు క్రొత్తతహాసీలుదారుగారినిఁ జూచుటకువచ్చిరి. వారినిఁజూచి గోపన్న "అయ్యలారా, మీరిదివఱకు బాకీయున్న సొమ్ము అంతయుఁ జెల్లించివేయుఁడు. నేను మిమ్ములను సుఖపెట్టుటకై వచ్చియున్నాను. నేను ఏమి చేయఁదలఁచుకొన్నను మీరేఆధారము; గావున మీరు నాకు అన్నిటను జేదోడువాదోడుగా నుండి నాకు సర్కారులో గౌరవమును గలిగింపుఁడు. మీరుసాయపడ రేని మీకు నేను చేయఁదలఁచిన సౌకర్యములు చేయఁజాలను. మీరును శ్రీ

రామచంద్రమూర్తి అవతరించియున్న భద్రగిరి ప్రాంతములయందున్న వారు. మీకు ధర్మము లేమియు ఉపదేశింపవలసిన పని లేదు. మనము అందఱమును శ్రీరామచంద్రుని భటులము, గావున మన భేదభావములు అన్నియు మఱచి శ్రీరాముని సేవింతము" అని చెప్పెను. రైతులు అందులకుఁ బరమానందముతో సంగీకరించిరి.

ఆసంవత్సరము గోపన్న పన్నులు అన్నియు ఒక్కదమ్మిడీయైన బాకీ లేకుండునట్లు వసూలు చేసి యుక్తకాలమున గోలకొండకుఁ బంపివేసెను. అది చూచి నవాబు ఆతని చాకచక్యమునకు ఎంతయు మెచ్చుకొనెను. ఇట్లుకొన్ని దినములు గడచిపోయెను. కాలము గడచిన కొలఁదిని భద్రాచలము తాలూకాయందలి ప్రజలకు గోపన్న తహసీలుదారు అనుటకంటె రామదాసు అని ఎక్కుడు గౌరవభావము గలిగెను. ఆతని అందఱును గోపన్న యనుట మానివేసి రామదాసు అని పిలువసాగిరి. మఱికొన్ని దినములు గడచునప్పటికి గోపన్న తన పేరు మఱచిపోయి ఎవరైన నడిగినచో రామదాసు అనియే చెప్పసాగెను. తెల్లవాఱినది మొదలు సాయంత్రము అగునంతవనుక రాజకార్యములయందును సాయంత్రము అయినది మొదలు తెల్లవాఱునంతవనుక రామకార్యములయందును రామదాసు లీనుఁడై పోవుచుండెను. ఆతని ఏల్బడిలో నున్న ప్రజలు గూడ కొల్లిటికంటె రామభక్తులు కాఁజొచ్చిరి. ఎక్కడఁ జూచినను రామోత్సవములే. ఎక్కడ వినినను రామనామమే.

ఇట్టి స్థితి సంభవించునప్పటికి రామదాసునకు ఒక తలంపు ఒడమెను. శ్రీరామచంద్రుఁడు ఆచ్ఛాదనము లేకుండ కొండమీఁదఁ బడియుండుట ఆతనికి మంచిదిగా తోఁచలేదు. తనయేల్బడిలో శ్రీరామునకు ఆలయనిర్మాణము కాకపోయినచో తనకు అధోగతి తప్పవేఱులేదని ఆతఁడు భావించి ఆలయము ఎట్లు పూర్తియగునని భావింపసాగెను. ఇంతలో ఆతాలూకాయందలి పెద్దరహితులు కొందఱు ఏదోపని మీఁద రామదాసు చెంగటకు వచ్చిరి. అప్పుడు ఆతఁడు వారినందఱను ఆదరించి "అయ్యలారా! జననమరణములు సహజములు. భూమిమీఁద నుదయించిన ఏప్రాణియుఁ జావకుండ నుండదు. ఇహలోకమున మనము చేయు సుకృత దుష్కృతములను అనుసరించి మన భవిష్యజ్జన్మము

కల్పింపఁబడును. మన భవిష్యత్తు అంతయు మన అఱచేత నున్నది. ఈ సంగతి అనేకులకుఁ దెలియదు. కావుననే వారు మంచిచెడ్డలు యోచింపక తోఁచినట్లెల్లఁ బ్రవర్తింతురు. నరజన్మమునకంటె స్వర్గమున దేవతలయి పుట్టుట మంచిది. అందులకు మనము ఇచ్చట బుణ్యము చేసికొనవలెను; గాని పుణ్యము శాశ్వతము గాదు. అది కొన్నిదినములకు తరిగిపోవును. అప్పుడు స్వర్గమున నున్నఆత్మ మరల నరజన్మమునెత్తి భూమిమీఁద సంచరింప వలసియుండును. ఇది యెంత కష్టమో యోచింపుఁడు. మరల యేజన్మము నెత్తకుండ శాశ్వతబ్రహ్మలోక నివాసము నొసంగు ఉపాయము ఒకటి గలదు. అది నిష్కామబుద్ధితో శ్రీహరిని సేవించుటయే. శ్రీహరిని సేవించినవారు శ్రీహరిసాయుజ్యమును బడయుదురు. దానికి ఇఁక అంతము అనునది లేదు. అందులకు మార్గము అర్పణము; గావున మనకు గలది అంతయు శ్రీరామచంద్రునకు సమర్పించి ధన్యతం గాంతము. శ్రీరామచంద్రుఁడు పర్వతోపరిభాగమున ఎండను ఎండుచు వానను దడియుచు దిక్కులేని వానివలె నవయుచున్నాఁడు. అది మనకే అపాయకరము గావున మనము మనచెంత నున్నధనముతో ఒక యాలయము కట్టించి స్వామి నందుఁ బ్రవేశపెట్టుదము. ధనము గలవారము ధనము ఇత్తము. ధనము కలవారును లేనివారునుగూడ కూలిఅడుగకుండ పనిచేయుదము" అని చెప్పె. అందులకు రహితులు అందఱును అంగీకరించిరి.

అంతట శుభముహూర్తమున ఆలయనిర్మాణము ప్రారంభించిరి. చుట్టుప్రక్కల గ్రామములయందలి రహితు లందఱును వచ్చి పనులు చేయసాగిరి. దూరదూరములనుండి గొప్పగొప్పశిల్పులు వచ్చిరి. ఒక గడియయైన విఘ్నము రాలేదు. కొలఁది దినములయందే ఆలయనిర్మాణము పూర్తియయ్యెను. ఆయాలయమును జూచియు రామదాసు భక్తిశ్రద్ధలను జూచి అందఱును ఈవిధముగఁ జెప్పుకొనసాగిరి.

కల్యాణిరాగము - ఆదితాళము.

కైంకర్యము చేసెను రామదాసు కైంకర్యము చేసెను॥
కైంకర్యము చేసె కామితములనొసఁగు సంకటహరణా స్వామి యని మ్రొక్కి ॥కైంకర్యము॥
శిఖర మగు రాజతమణిశాలల, ప్రాకారంబుల బహుమకుటపంక్తుల
మంజుళతర మగు మణిమంటపముల, కంజరాగమణికలితాంగణముల

చారుచక్యకాంచనకూటంబుల, నాకాశంబున కంటెడు తేరుల
గోపుర మొరసెడి గోపుర వితతుల, దీపించు వితర్దికల బెడంగుల
తళుకు గులుకు పగడపు కంబంబుల, కలశంబులను గల కలశములు
రంగగు ముత్యపు రంగవల్లికల, శృంగారములగు చిత్రశాలికల
సుకరతోరణసమాజంబుల మణి, మకరతోరణసమూహంబులం గడు
భుగభుగ వలచెడు ధూపదీపముల, అగరుధూపముల నాలుపట్టిముల
మెరసెడి రీతిని మేలిమి గాంచను ॥ కైంకర్యము॥

ధారాళము లగు ద్వారబంధముల, నానారత్నకాంచనశిఖరంబుల
సమాసన్ననిమోదు సింహాసనముల, ఘుమఘుమ యను నలుకుంకుమరసముల
ఝణఝణ యను మువ్వగంటల మ్రోతలు, ధిమిధిమి యనియెడు మృదంగవాద్యముల
మిసమిస మెరసెడి మేటి మిసిమిల, కనకమయంపు గరుడధ్వజముల
రామనామమును రామతారకంబుల, నేమము సేయెడు విబుధగణంబుల
ఆసంగ స్తోత్రమనుపమ గానంబుల, కోమలి రంభాదుల నృత్యంబుల
వైనతేయముఖ వాహనచయముల, భూరిశంఖఘంటా నాదంబుల
మెరసెడి రీతిని మేలిమి గాంచను ॥ కైంకర్యము॥

పల్లకీగొడుగులను వింజామరముల, మల్లెల మొల్లల మంచివాసనల
పిల్లనగ్రోవి నగభేరి స్వరముల, ఝల్లరి కాహళ జయనాదంబుల
పల్లవపాణుల పాటల నాటల, సల్లలితోత్సవ చందనపరిమళము
వనమాలాసంపత్సౌరభముల, ఘనతులసీవనచందనగంధంబుల
రామభజనసంతాపహరముల, రామతీర్థసారసముల రాముల
రామస్మరణల నామజపంబుల, రామ స్తవ విస్తారాదరముల
హనుమద్గజవాహనముల ఘనముగ, అనుపమ శృంగారానందంబుల
రమణ భద్రగిరిరామునకు సత్యముగానందంబై కలుగుల
మెరసెడి రీతిని మేలిమి గాంచను ॥ కైంకర్యము॥

గుళ్లు గోపురములు మున్నగునవి అన్నియు పూర్తియగు నప్పటికి రామదాసు చెంతను రక్షితులవద్దను గల ధనము అంతయు నైపోయెను. ఇంకను సంప్రోక్షణాదికములు అన్నియు మిగిలియే యుండును. ఇదంతయు నెట్లు అగునని రామదాసునకు దిగులుపుట్టెను. ఎన్ని విధముల నాలోచించినను ఆతనికి ఏమియుఁ దోఁచినదిగాదుగాని నాఁటిరాత్రి శ్రీరాముఁడు స్వప్నమున సాక్షాత్కరించి "విచారింపకుము. సర్కారుపైక

ము వెచ్చింపుము" అని చెప్పెను. మఱునాఁడు ఉదయము రాముఁడే ఉపాయము సెప్పినందులకు పరమానందకందళితహృదయారవిందుఁడగుచు రామదాసు కోశాధికారిని బిలిచి కోశమున ధనము ఎంతయున్నది. యని యడిగెను. కోశాధికారి పోయి చూచి వచ్చి ఆఱులక్షలు కలదనియెను. రామదాసు ఆఆఱులక్షలతోఁను తక్కిన సమస్తమును నెఱవేర్చెను.

ఆసంవత్సరము అన్ని తాలూకాలనుండియు పన్నులు వసూలయ్యెను; గాని భద్రాచలము తాలూకానుండి మాత్రము వసూలు అయి రాకపోవుటకుఁ గల కారణము నెఱుంగగ గోల్కొండయందును కోశాధ్యక్షుఁడు కలవరపడసాగెను. ఇంతలో మాదన్న కోశమును లెక్కలను పరీక్షించెను. అప్పుడు మాదన్న "గోపన్న పన్నువసూలు చేసి ఏల పంపలేదో కనుగొని రండు" అని కొందఱు సరదారులను నియమించెను. వారును ప్రభువు నానతి చొప్పున వెంటనే బయలుదేఱి స్వల్పకాలమునందే భద్రాచలము చేరుకొనిరి. వారువచ్చిన కార్యమును విని గోపన్న మాఱు పలుకక—

దర్బారురాగము - చాపుతాళము.

పల్లవి. వచ్చేవో రామ మాయింటికి॥ వచ్చేవో॥

అనుపల్లవి.

వచ్చేవో రామ వాసుదేవ నేఁడు అక్రూరుని యట్ల నన్నాదరింపఁగ నే॥ వచ్చేవో॥

పంపిస్తినైతి రాము నీ సందేశము నమ్మి, మహాత్మ్యము మని పొలుగని ల్లప్పుడు గోపురము
వసుచేరంతి కాపాడు మని నేను॥ వచ్చేవో॥

కరుణించరాదా రామ నిన్ను నే నమ్మితేను, గమనమున గౌతమసతి నహల్యను నరయూ
ప చేసిన చరణముల మ్రొక్కెద॥ వచ్చేవో॥

మ్రొక్కెను రారా ఏలఁగ నన్ను దిక్కు గానేరా, చక్కని భద్రాచలరామదాసుఁడ
నక్కరతో నన్నాదరించు నేను॥ వచ్చేవో రామ॥

అని అదేపనిగ రామస్మరణ ప్రారంభించెను. ఈనిరుత్తరము వలనను ఆతనిపాటలవలనను బట్టియు సొమ్ము ఆతఁడు దుర్వినియోగము చేసె నని తలంచి మఱికొంతసేపటికి అచ్చటి కోశాధ్యక్షునివలన నిజమెఱింగి గడగడలాడుచు సరదారులు గోల్కొండకుఁ బోయి

సంగతులు అన్నియు మాదన్నకు ఎఱిఁగించిరి. ఇది విని మాదన్న చాల వగచి అక్కన్నతోఁ జెప్పి కార్యగతుల నూహించుచుండఁగా తానీషా లెక్కలు పరీక్ష సేయుటకు కోశాగారమునకు వచ్చెను. అచ్చట నాతఁడు అన్నితాలూకాలనుండియు సొమ్ము పూర్తిగా వచ్చియుండు టయు ఒక్క భద్రాచలముతాలూకానుండి మాత్రమే రాకపోవుటయుఁ జూచి "ఏమి కారణము?" అని యడిగెను. అంతట కోశాధికారి రామదాసు భద్రాచలరామునకు ఆలయాదులు కట్టించుట మున్నగు తాను వినిన సంగతులు ఎల్ల నెఱిఁగించిరి. అది వినినతోడనే తానీషా "మా తాలూకు ఆఱులక్షలరూపాయలు నిర్భయుఁడై వీఁడు రాముని నిమిత్తము వెచ్చించినాఁడా?" యని మహోగ్రుఁడై మండిపడి "ఉన్నట్లుం డఁగా వానిని కట్టి తెండు" అని సరదారులకు ఆజ్ఞయిచ్చెను.

పోఁడనే వారు బయలుదేఱి భద్రాచలముఁ జేరి గోపన్నను తిట్టుచు నిందించుచు కొట్టుచు గోల్కొండకుఁ బ్రయాణమైరి. భద్రాచలమునందలి వారెల్లరును రామదాసునకు ఇట్టి గతి పట్టినందులకు ఎంతయు వగచి "రామా, నీదాసునిఁ బ్రోవ నిదే సమయము" అని అనేకవిధములఁ బ్రార్థింపసాగిరి అంతకంటె వారు ఏమి చేయఁగలరు?

యమునాకల్యాణిరాగము - ఆదితాళము.

గరుడగమన రారా నను నీ కరుణ నేలుకోరా
పరమపురుష యే యుగపురులలో నీ మహిమలుగు నీచ్ఛలని అమరచేయరా॥ గరుడ॥
పిలువగా నె రమ్మా అభయము తెలుపఁగా నె ఇమ్మా
కలిమి బలిమి నాకిలలో నెవని కలవరించితిని నలుపుచు గన్నయ్యా॥ గరుడ॥
పాలకడలిశయన దశరథబాల జలజనయన
పాలయించు నను నెల్లయుంచు నీ పాలఁబడితి నిఁక జాలము సేయకు॥ గరుడ॥
ఏలరావు స్వామీ నను నిపు డేలుకోవదేమి
ఏలువాఁడ వని చాల నమ్మితిని యేలరావు కరుణాలవాల హరి॥ గరుడ॥
ఇంత పంతమేల భద్రగిరీశ వంకృపాలు
చింతలుడఁచి కంచర్లరామదాసాంతరంగపతివై రక్షింపుము॥ గరుడ॥

అని రామదాసు గూడ అనేకవిధములఁ బ్రార్థింపసాగెను. కొలఁది దినములలో వారు గోల్కొండఁ జేరుకొనిరి. యుక్తసమయమున సరదా

రులు గోపన్నను తానీషా ఎదుటకుఁ గొనిపోయి నిలిపిరి. రామదాసు నిఁజూచిన వెంటనే తానీషాముఖము మహాకోపముచే ఎఱ్ఱఁబడెను. అంత నాతఁడు మండిపడుచు "గోపన్నా, మిన్నుమన్నులు గానకుండ సంచరించుచున్నావఁట! మాసొమ్మును వెంటనే చెల్లింపుము" అని పలికెను. అందులకు రామదాసు "ఏల ఇట్లు కోపించెదవు? నీధనము, శ్రీరామచంద్రునకు సమర్పింపఁబడినది. నీవు ధన్యుఁడవైతివి" యని జవాబు ఇచ్చెను. తానీషాకోపము ఆమాటలతో ఆకసమంటఁ బెరిగిపోయెను. తోడనే యాతఁడు హర్కారులకు "ఈతనిని బందిఖానాలో వేయుఁడు. నాసొమ్ము ఎట్లురాదో చూచెదను. పండ్రెండు దినములలో మీరు ఈతని వలన ఆఱులక్షల రూకలను రాబట్టవలెను" అని యాజ్ఞాపించెను.

తోడనే హర్కారులు రామదాసుని కైదులోనికిఁ గొనిపోయిరి. ఈదారుణచర్యను జూచిన పౌరులెల్లరును చాల వగచిరి. రామదాసును రక్షింపుమని శ్రీరామచంద్రుని ప్రార్థించుచు కైదులోనికిఁ బోయెను. హర్కారులు ఉప్పుబియ్యము మున్నగు సామగ్రి తెచ్చి ఇచ్చి వెడలిపోయిరి. రామదాసు వారు వెడలిపోయిన తరువాత వానిని పచనము చేయ పాత్రయందు అన్నమునకు మాఱుగా అమృతతుల్యము అగు పాయసము ఉండెను. ఇదియంతయు రాముని కరుణయే యని యాతని యెడల రామునకు దయ తప్ప లేదనియు ఆనందించుచు రామదాసు ఆపాయసమును రామునకు నివేదించి పిదప తాను భక్షించెను.

మఱునాఁడు కారాగారరక్షకులు తానీషా చెంతకుఁ బోయి "ప్రభూ, ఆతఁడు ఈకారాగృహవాసమును ఏమియు లెక్కసేయుట లేదు. ఆనందముగా నున్నాఁడు. ధనము ఇచ్చునట్లు కాన్పింపదు" అని చెప్పిరి. అదివిని తానీషా మండిపడి "మంచిమాటలతో ఇచ్చువాఁడు కాఁడు. కొట్టుఁడు. మాసొమ్మిచ్చునంతవఱకు గుండ్లుగట్టి పురమున అన్నివీధులను త్రిప్పుఁడు. మీచేతనైనన్ని బాధలు పెట్టుఁడు" అని యాజ్ఞాపించెను. యమభటులకుఁగూడ క్రౌర్యము నేర్పఁగల ఆభటులు ప్రభువునాజ్ఞ ముగిసిన వెంటనే ఆహాహా! యని యఱచుచుఁ బోయి ఆప్రకారముగ రామదాసునిఁ బీడింపసాగిరి. అయినను రామదాసు వానిని లెక్కసేయక ఏమియు నెఱుంగనట్లు రామస్మరణము చేయుచు ఆనందించుచుండెను

ఒకనాఁడు భటులలో నొకఁడు మేమెంతకొట్టినను నీవు "అమ్మా యనవు. ఏడువవు. నీకు దిక్కెవరు? మాదెబ్బలు నీకు ఏల తగులుట లేదు?" అని యడిగెను. అప్పుడు రామదాసు "తనమీఁద శ్రీరామచంద్రునకు అనుగ్రహము గ॥"దని చెప్పి రాముని మాహాత్మ్యమును వారియెదుట నుపన్యసించెను. అదివిని కొందఱు భటులు రామభక్తులైరి. తక్కిన వారు మండిపడుచు తానీషా చెంతకుఁ బోయి "ఏలినవాఁడా, ఎన్నికొట్టినను వాఁడు లెక్కసేయుట లేదు. కొట్టినకొలఁది నవ్వుచున్నాఁడు. ధనమువచ్చుమార్గము కాన్పించదు" అని మరలఁ జెప్పిరి. అప్పుడు తానీషా రామదాసుని సింహాలగమునకు రావించి "మాధనము ఇచ్చెదవా లేదా!" యని గద్దించి పలికెను. రామదాసు అందులకు భీతిల్లక "నీసొమ్ము శ్రీరామచంద్రునకు వినియోగింపఁబడినది. నీవు తలంచితివి. మఱల ఆధనము గోరెదవేని నరకమునఁ గూలఁబడిపోయెదవు" అని ప్రత్యుత్తరము ఇచ్చెను. ఈజవాబు తానీషాకు నిప్పుమీఁద నేయిపోసినట్లు అయ్యెను. తోడనే ఆతఁడు మఱింత మండిపడి "వీనిని దయచూడక సంహరించి వేయుఁడు" అని యాజ్ఞాపించెను.

భటులు రామదాసునిమీఁద అనేకపర్యాయములు ప్రచండచంద్రహాసములు విసరిరి; గాని ఆతనికి ఏమియు అపాయము గలుగ లేదు. యథాప్రకారముగనే యుండెను. అంతట విసిగిపోయి భటులు ఆతనిని మఱలం గైదులోఁ బడవేసి నల్లులు, దోమలు, తేళ్లు మున్నగువానిం గఱపించిరి. గాని అప్పుడును వారి ప్రయత్నములు విఫలములే యయ్యెను.

రామదాసు విసుగు విరామములు లేకుండ శ్రీరామునిఁ బ్రార్థించి కారామోచనము గానక "రాముఁడు దయఁ దలఁపలేదు." అని భావించి అనేకవిధముల సీతాదేవినిఁ బ్రార్థించెను. సీతాదేవి హృదయము వెంటనే కరిగెను. తోడనే ఆమె రామునకు జాలిగలుగునట్లు రామదాసు స్థితిగతుల నెఱింగించి "ఆతనిని వెంటనే చెఱ విడిపింపవలయును" అని యాజ్ఞాపించెను. అంతట రాముఁడు లక్ష్మణునితోఁ గూడ సేవకవేషములు ధరించి అర్ధరాత్రమున బయలుదేఱి గోల్కొండనగరముఁ జేరి తానీషా యంతఃపురము ప్రవేశించి తానీషాకు స్వప్నమున సాక్షా

త్కరించెను. తోడనే తానీషా లేచి కూర్చుండి ఏకశయ్యపై నిదురించుచున్న భార్యను లేపి స్వప్నమున ఇరువురు మహాత్ములం గాంచితినని చెప్పుచు అబ్బురపడుచుండ రామలక్ష్మణులు తలుపు తట్టిరి. తోడనే తానీషా తలుపులు తెఱచెను.

రామలక్ష్మణులు లోపలఁ బ్రవేశించిరి. వారినిఁ జూచి తానీషాయును ఆతని భార్యయు ఏమియుఁ దోఁచక అబ్బురపడసాగిరి. కొంతసేపటికి రాముఁడు "తానీషా, రామదాసు నెచ్చట నేమి చేయుచున్నావు?" అని యడిగెను. అందులకు జవాబు చెప్పకయే తానీషా "మీరెవరు? అనేకవీరభటపరిరక్షితము అగు ఈ అంతఃపురమునకు ఎట్లు వచ్చినారు? ఏల వచ్చితిరి." అని యడిగెను. ఈసందర్భమున వారికి ఈక్రిందిరీతిని సంభాషణము జరిగెను.

నాదనామక్రియరాగము - ఆదితాళము.

ఎవరి సర్దారులు మీరు అయ్యా ఎవరి హుకుమున వచ్చినారు?
గోపన్నగారి సర్దార్లు మా ప్రాణ కోటినాకిస్తు.
ఎందుకు నిటకు వచ్చినారు మిమ్మెంగలకై పంపినారు?
తెల్లవారకె ముందు మీకు బాకీ చెల్లఁగట్టి పొందుకొనుడు.
వసూలు మీ నామము లేమి? మీ వంగసమునకు పేరేమి?
రామోజి లక్ష్మోజి నామము మాది రఘువంశ మను పేరనాము.
కొల్వు కొచ్చినవారు మీకు వచ్చి కూలికిచ్చుటఁ జెల్పుమాకు.
మూఁడుతరములుగ నున్నాము మమ్ము గాపాడి పెడుదురన్నాము.
కొలువు కొలవఁగ ఘనులేము? ఈకొల్వునవచ్చినదేమి?
కొల్వు కొలుచుట నేలనయ్యా పొట్టకూటికై కాదఁటయయ్యా.
మా పైకము తెచ్చినారా? వెల్లమాటు లాహిఁగ వచ్చినారా?
మీ పైకముఁ దెచ్చినాము నెల్లమాటు జాతె తెలుఁగము.
ఎంత పైకముఁ దెచ్చినారు మీ రిప్పుడేమి చెప్పుచున్నారు?
మీ కెంత బాకి చెప్పండి అది మీరిప్పుడే చెల్లించుకోండి.
ఆరులక్షలు ఇవ్వండి మీ రాపని గోపనను జూడండి
ఆరులక్షలు తేలేదండి మీకు అవలిచ్చేవారు లేరండి.
మీ రెంత తెచ్చినారండి మంచి పోరాటమాయెను ండి
మూఁడులక్షలున్నదండి మీ యొద్ద మారుపల్కలేవండి

టకు కాగితమా? కలమా?. అగుట నాతఁడు తప్పుపడిగముమీఁద తన మొహరువేసి ఇచ్చి వారిని పంపివేసెను.

దానినిఁ గైకొని రామలక్ష్మణులు బయలుదేఱి చెఱసాలకుఁ బోయిరి. అప్పటికి ఇంకను జాము రాత్రి ఉండెను. రామదాసు తనకు ఇఁక విముక్తి లేదని పరిపరివిధములఁ దుఃఖించుచు —

మ॥ "అతికారుణ్యముతో నిపు డెక్కుడగు నత్యాపన్నుఁ డైనను స
మ్మతిలో నిందుక కాచి ప్రోవ బెకకు నేనేమఁ గాంతింప నే
గతి యేమో గోరఁ జెరిగు నన్య మేలుఁగా గాంచింటి నీ ప్రాపుఁ బో
ష్పుతి నీ చిత్తము ఎట్లు వచ్చిన నిఁక శ్రీభద్రనారాయణా."

మ॥ "కరి నేరించి హాయిక్కి ప్రోచితి కోరికల్ మెచ్చి యిచ్చితివి స
[illegible] కారీసుతునం సిరాయినన్ జేర్చితిం [illegible] ర్థం [illegible]
శరణన్నం గనాని తమ్మునికి రాజ్యం బిచ్చితివి గల్లయు
త్తైల నన్నేల [illegible] భద్రనారాయణా."

అని యుతీరునఁ బ్రార్థించుచుండెను. ఈస్థితినిఁ జూచిన వెంటనే రాముని హృదయమునఁ జాల తత్తరము ఒదవెను. అపుడు ఆతఁడు "లక్ష్మణా, జాగుచేయక చెఱలోఁ బ్రవేశింపుము. రామదాసు దీనానను నేను చూడఁ జాలకున్నాఁడను" అని తమ్ముని లోనికిఁ బంపి తానీసా మాపముతో తానుగూడ లోపల ప్రవేశించెను. అంతకుఁ బూర్వము రామదాసు ఇఁక నెట్లును రాముని కృప గలుగదని జీవితము నెడల నిరాశ చేసికొని విషపానము చేయుటకు సిద్ధముగా నుండెను. ఆతఁడు పాత్రములో విషము నెదుట నుంచుకొని శ్రీహరికి అంత్యప్రార్థనము నమర్పించి విషము పానము చేయఁదలఁచెను. రామదాసు ప్రార్థనము చేయుచుండఁగా చెఱలోఁ బ్రవేశించిన రామలక్ష్మణులు మున్ముందు ఆ పాత్రమునందలి విషమును మాయము చేసిరి. ప్రార్థనానంతరము కన్ను లు తెఱచి పాత్రమున విషము లేకుండుటఁ జూచి రామదాసు ఇదియంతయు రాముని లీల యని ఆశ్చర్యపడసాగెను. ఆతఁడు కన్నులు విప్పునప్పటికి రామలక్ష్మణులు మాయమై పోయిరి.

ఇది ఇట్లు జరుగుచుండఁగా నచ్చట నవాబు భార్యతో సంగతు లన్నియు నెఱింగించి వెంటనే కొలువుకూటమునకు వచ్చి అక్కన్న

మాదన్న గార్లకు తక్షణము రావలసినదని వర్తమానము చేసెను. అది విని వారు ఆశ్చర్యపడి సముచితవేషములతో బయలుదేఱి వచ్చిరి. తానీషా, వారితో జరిగినది అంతయుఁ దెలిపి "వెంటనే రామదాసుని జెఱ విడిపించి మేము స్వారిచేయు బండిలోఁ గూర్చుండఁజేసి మహావైభవముతో నూరేగించి కొనిరావలసినది" అని యాజ్ఞాపించెను. అక్కన్న మాదన్నగార్లు తమ మేనల్లునకు సంభవించిన యోగ్యస్థితికి ఆనందించి అంతయు నవాబు చెప్పినట్లు చేసి ఆతనిని కొలువుకూటమునకుఁ గొని వచ్చిరి. తానీషా రామదాసుని అల్లంతదూరమునందే చూచి గద్దియడిగి ఎదురువోయి సాష్టాంగనమస్కారములు ఆచరించి కౌఁగిలించుకొని కొనివచ్చి సింహాసనమునఁ గూర్చుండఁజేసి తాను ఆతని పాదముల చెంతఁ గూర్చుండి "తన అపరాధములు అన్నియు క్షమింపవలసినది" అని యనేకవిధములఁ బ్రార్థించెను. పురమంతయు ఆనందించెను. రామదాసు "గతమునకు వగవవలదు" అని నవాబునకు అభయమిచ్చి "నీవు మహాయదృష్టవంతుఁడవు; గావుననే శ్రీరామచంద్రుఁడు నీకు అయాచితముగ దర్శనము నిచ్చెను. నీవు పూర్వమున తపశ్శాలివి. కాకున్న నిట్టిది తటస్థింపదు" అని యాతని ననేకవిధములఁ గొనియాడెను.

అట భద్రాచలమున మఱునాఁటి ప్రాతఃకాలమున అర్చకులు యథాప్రకారముగ తలుపులు తెఱచునప్పటికి రామలక్ష్మణులు రాత్రి గోల్కొండలో తానీషాకు దర్శనమిచ్చిన వేషములతో నుండిరి. రాముని చేతిలో నవాబు ఇచ్చిన విచిత్రపు రశీదు ఉండెను. ఇది యంతయుఁ జూచి వారు చాల అబ్బురపడి ఈవృత్తాంతమునంతయు అమీరునకుఁ దెలిపిరి. అమీరు ఆవింత రసీదును బేగీరావుటవామీఁద గోలకొండకుఁ బంపివేసి ఆహర్కారులతో ఇక్కడి సంగతులు అన్నియు నెఱింగింపుఁడు అని నియమించెను. ఈబేగీరావుటవా గోలకొండ చేరునప్పటికి నవాబు మంత్రిసామంతాదులతోఁ గూడనిండుకొలువున రామదాసునకు మహాసత్కారము చేయుచుండెను. అప్పుడు ఆతఁడు ఈరశీదును జూచి ఆశ్చర్యపడి "రాముఁడు రామదాసు ఆజ్ఞానువర్తియై ఉన్నాఁడు" అని తలఁచి వృత్తాంతము అంతయు సభ్యులకు ఎఱింగించెను. అందఱును పరమానందభరితులైరి. పిదప తానీషా ఆవింత రశీదును రామదాసునకు ఇచ్చుచు ఇట్లు చెప్పెను.

## నాదనామక్రియరాగము - ఆదితాళము.

పల్లవి॥ రామదాసుగారూ రండీ కౌఁదంసుకొండీ

అనుపల్లవి॥ రండీ మనవి వినండీ కృప యుంచండీ రామునిపై మనసుంచండీ. రామ.

చరణములు॥ ఇచ్చి సొచ్చకిందు రాతిరి నిద్ర ఏసుంగ

వచ్చియుదట పూర్వపైకం బంతయు నిచ్చిగానుంను ప్రసన్నుఁ డై బ్రోవఁగ. రామ.

కట్టిరాగులతో వానలు కిట్టాకత్తులతో

పెట్టినవిహ్వ ట్టుచు మనసుఁగ ఇట్టిపేయుఁ సుట్టిమిరి ఇటు రామ.

ఎంతగాంతయిచ్చులో నీయాదగు స్వామిరెంబడి ఎపుడులో

ఇంతకష్టములు దృశ్యోత్రితిరో సంతరింపితిని ఎంతైన మేలుఁగాక. రామ.

కృపణాఁడనేఁగనుక మీపై కృపలేదను లేక

యపవాదంబున కారాగృహమున క్షేత్రో యాతనలు పలుఁడనరా రామ.

తనకనాఁదనసుఁడు నాపై సాక్షిగనుతను బాట

మామహాశయుని నిత్రనికేతని శ్రీరామునిఁ గనుఁగొనె బంగనుండదను. రామ.

గనేదు ఇచ్చుట ధ్యానతెగువాత తానీషా భద్రాచలము తాలూ కాను రామదాసునకు జాగీరుగా నిచ్చి అప్పుడు సరమానా గూడ ఇచ్చి వేసి రాముఁడు ఇచ్చినఆలుఁగులు ప్రైకంబును నుతి యనేకరత్నాభర ణములను రామదాసునకు ఇచ్చి అనేకవిధముల సన్మానను బ్రార్థించి మహావైభవముతో నాతనిని భద్రాచలమునకుఁబంపివేసెను. రామదా సును మఱల రాముని జూడబోవుచున్నాను అను పరిమానందముతో నృత్యము చేయుచుఁ బోవుచుండెను. భద్రాచలమునుసమీపించునప్ప టికి ఒకనాఁటి సాయంకాలము అఖండవర్షము కురియసాగెను. ఆసమయ మున దారిదోపుడుగాండ్రు వందలకొలఁది వచ్చి రామదాసుని అరి కట్టి సొమ్ము అంతయు అక్కడఁ బెట్టుమని నిర్బంధింపసాగిరి. అది చూచి రామదాసు భీతిల్లక రామస్మరణము ప్రారంభించెను. తోడనే ఆదొం గలు అందఱును మాయమైపోయిరి. ఇది చూచి రామదాసు ఇది యం తయు రాముని మాయయనియు రాముఁడు తన్ను పరీక్షించుటకు ఇట్లు చేసెననియు భావించి మఱింత యానందముతో మఱల నృత్యము చేయుచుఁ బ్రయాణము సాగెను.

మఱునాఁటిప్రాతఃకాలమునకురామదాసుపరివారముతోఁగూడి భద్రగిరిని సమీపించెను.తోడనేఆతఁడు అఖండగౌతమీనదిలోజలక మాడిపరివారముతోనూతిలోనికిఁ బయలుదేఱెను. అంతకుఁబూర్వమే ఈసంగతి యంతయు వినినభద్రగిరివాసులు మృదంగములు తంబురలు మున్నగు సకలమంగళవాద్యములతోడను ఎదురువచ్చి మహోత్సవ ముతో రామదాసుని పురములోనికిఁ గొనిపోయిరి.

రామదాసు తొలుత శైలము ఎక్కి విధివిధానముగ రాముని సేవించి పిదప స్వగృహము చేరుకొనెను. అది మొదలుకొని యాతఁడు శ్రీరామచంద్రునకు ఏమియు లోపము కలుగకుండునట్లు మహోత్సవ ములు చేయుచు అనుదినమును అనేకబ్రాహ్మణులకు సంతర్పణము సేయుచు సంసారమునంటక తామరాకుమీఁదనీటి బిందువువలె సంచ రించు చుండెను.

ఇట్లు కాలము గడచిపోవుచుండఁగాఒకనాఁడుసీతాదేవి శ్రీరా మునితో "నాథా, నీకు ఇది ఏమి ధర్మము! అనవరతము నిన్నే నమ్మి యున్న రామదాసునకు దర్శనము ఈయకపోయితివి. నిన్ను కలనైన తలంపని మ్లేచ్ఛునకు దర్శనము ఇచ్చితివి. ఇది బాగుగ నున్నదా?" అని యడిగెను. అందులకు రాముఁడు ఇట్లు ప్రత్యుత్తరము ఇచ్చెను.

"దేవీ, నీవు మంచిప్రశ్న వేసితివి. వినుము, తొల్లి ఒక బ్రాహ్మ ణుఁడు ఉండెను. కాశీనగరమునకు అవ్వలనొకచోటనొకశివాలయము ఉన్నది. విధివిధానముగ ఒక్క సంవత్సర కాలము ఆ దేవునకు రుద్రాభిషే కము సేసినవారికి మహేంద్రపదవి లభించును. ఆబ్రాహ్మణుఁడు మహేం ద్రపదవిని గోరి ఆ దేవునకు రుద్రాభిషేకము ప్రారంభించెను ఆతఁడు సంవత్సరమును చేసెను. గాని రేపటికి సంవత్సరము ముగియు ననఁగా "ఆతఁడు ఇంకను ఏల ఈయుమహానుభావుఁడు సాక్షాత్కరింపఁడు" అని ఉత్కంఠనుఁ బట్టఁజాలక కోపించి అభిషేకార్థము తెచ్చిన జలపూర్ణ మగు ఘటమును లింగముమీఁద విసరివేసెను. తోడనే ఈశ్వరుఁడు సాక్షాత్కరించి "నీవు ఇంతవఱకును ఎంతభక్తియుక్తుఁడవై నను నేఁడు తొందరపడి మనస్సును చెఱచికొంటివి. గావున నీకిఁక మహేంద్రపదవి రాదు. మఱేమన: భూలోకమున మహారాజవు అయ్యెదవు. అయితే ధూర్తుఁడవై జలపూర్ణమగు ఘటమును నామీఁద విసరివేసితివి, గావున

మ్లేచ్ఛుఁడ వయ్యెదవు. నాదర్శనభాగ్యమును బడసినందులకు మ్లేచ్ఛుల యందెల్లధర్మాత్ముఁడవు అయ్యెదవు. నిన్ను శ్రీరామచంద్రుఁడురక్షించు" నని పలికెను ఆబ్రాహ్మణుఁడే ఈ తానీషా. ఈశ్వరాజ్ఞవలన నేను ఆతనికి దర్శన మిచ్చి కరుణించితిని.

"ఇంక రామదాసుసంగతి వినుము. తొల్లి ఒక భూసురుఁడు ఒక చిలుకను బట్టి పంజరమున నునిచి అతిప్రీతితో దానినిఁ బెంచుచు రామరామాయని పాటలు నేర్పుచుండెడివాఁడు. కొన్ని దినములకు ఆతఁడు చనిపోయి రామదాసై పుట్టినాఁడు. ఆతఁడు చిలుకను పంజరమున బంధించెను; గావున ఈజన్మమున కైదులో నుండవలసివచ్చినది. అయినను దానికి రామనామమును నేర్పెను; గావున నాకు భక్తుఁడు అయ్యెను. ఆతనినిం గొలఁది దినములయందే రక్షించెద. తొందర పడకుము."

రాముఁడు ఇట్లు చెప్పుట విని సీత సంగతులు అన్నియుఁ దెలిసికొని మిగుల నానందించెను. కొన్నిదినములకు రామదాసునకు వృద్ధత్వము వచ్చెను. ఆతఁడు రామదర్శనమునకు రాఁజాలని స్థితికి వచ్చెను. అంత నాతఁడు "రామా, ఇఁక భూమిపై నిలువఁజాలను. రక్షింపుము" అని ప్రార్థింపసాగెను. ఆప్రార్థనకు ఆనందించి రాముఁడు తానొక గుఱ్ఱమువాని వేషము ధరించి లక్ష్మణుని గొడుగుపట్టువానినిగా నియమించి గరుత్మంతుని అశ్వముగన్నుని తిన్నగ రామదాసు ఇంటికిఁ బోయి "రామదాసుగారూ! రండి వైకుంఠమునకుఁ బోదము" అని పిలిచెను. తోడనే రామదాసు బైటకు వచ్చి రామునియాజ్ఞచే గుఱ్ఱము నెక్కి "వైకుంఠమునకుఁ బోదము రమ్ము" అనిభార్యను బిలిచెను; గాని ఆమె లోపలనుండి "స్నానముచేయుచున్నాను. కొంచెముతడవుఉండవలెను." అని జవాబు చెప్పెను అంతట రామాజ్ఞచే గుఱ్ఱము బయలుదేఱెను. రామదాసు భార్యను దలంచుకొని "ఎవరి పుణ్యమునకు ఎవరు కర్తలు" అని యనుకొనుచు వెడలిపోయెను.

కొంతసేపటికి గుఱ్ఱము భద్రగిరిశిఖరము నెక్కెను. ఆలయద్వారము మూసి యుండుటఁ గాంచి రామదాసు రామస్మరణ ప్రారంభిం

భారతీయులలోఁ గూడ నితఁడె ప్రథముఁడు. ౧౮౯౬-వ సంవత్సరమున కాన్వొకేషను సందర్భమున నీతఁడు ఒసఁగిన ఉపన్యాసము విద్యావిషయికములగు మహోపదేశములతో నిండియున్నది. ౧౮౯౫వ సంవత్సరమున ఈతఁడు ముత్తుస్వామి అయ్యరుస్థానమున మధురలో జడ్జిగా నియమింపఁబడెను; అట్టి ముత్తుస్వామయ్యరుపదవి గ్రహించి ఆతనివలెగొప్పవాఁడనిపించుకొనుట సులభమైన పనిగాదు. ౧౮౯౯, ౧౯౦౩, ౧౯౦౬ సంవత్సరములలో నీతఁడు మద్రాసుప్రధానన్యాయస్థానములో ప్రధానన్యాయమూర్తిపదవి ఆక్టింగుగా నిర్వహించెను. ౧౯౦౦వ సంపత్సరమున సర్ బిరుదముతో నీతఁడు అలంకరింపఁబడెను. ౧౯౦౭వ సంవత్సరము నవంబరు ౧౩వ తేదిని ఈతఁడు ఆరోగ్యము చెడుటవలన ఉద్యోగమును వదులుకొనెను. ఈతఁడు ఉద్యోగము నిర్వహింపవలసినకాలములో ఎనిమిదిమాసములు తక్కువ యగుటవలన వేయిరూపాయలు రావలసిన ఉపకారవేతనము ౮౮౦ రూపాయలే వచ్చుచున్నవి.అపుడు చెన్నపురి దొరతనమువారు ఈతని సామర్థ్యమును జాల పొగడుచు వ్రాసిరి.

ఉద్యోగానంతరము ఈతఁడు మద్రాసులోసముద్రతీరమునఁ గల మందిరమున నివసించుచు అనేకపనులు చేయసాగెను. అందు కంజీవరమున, సాంఘికవిషయములనుగుఱించి పూర్వాచారపరాయణుల అభిప్రాయములను సమకూర్చుటకు ఒకపరిషత్తు ఏర్పఱిచెను. అం దీతఁడు అనేకకృత్యములు చేసెను. ఇటీవల కొంతకాలము ఆతని నేత్రములకు బాధకలిగెను; గాని తరువాత బాగుపడెను.

ఇతఁడు విద్యను ముగించి గొప్పపదవులను బొందుటకు పెక్కు పేదవిద్యార్థులకు చాల సాహాయ్యముచేసెను. దక్షిణభారతదేశములో విద్యాధికులై యున్న వారందఱును, కీర్తిశేషులగు వి. కృష్ణస్వామయ్యరును, పి. ఆర్. సుందరఅయ్యరును తమ అభివృద్ధినిగుఱించి ఈతని యెడల ఎంతకృతజ్ఞులై యున్నదియు తెలిసికొనియే యున్నారు.

ఇతఁడు చేసినపనులు ఇంకను అనేకములుగలవు. వాని నన్నిటిని ప్రదర్శించుటకు ఇక్కడ స్థలములేదు. ౧౯౧౭ సంవత్సరమున మద్రాసు గవర్నరు, హోమురూలు ఉద్యమమునునిందించుచు, దానివిషయమున తమజీవితములను ధారవోయుచున్న అనిబిసెంటు, వాడియా, ఆరండేలు

గార్లకు నిర్బంధావాసము విధించెను అపుడు మనసుబ్రహ్మణ్యయ్యరు హఠాత్తుగ రంగమున కుఱికి ప్రభుత్వము వారి అనాలోచితకృత్యమును విమర్శింపఁ దొడఁగెను. హోమురూలు విషయమున నీతఁడు చూపు చున్న ఉత్సాహము అత్యద్భుతము. నేఁడు ఈతఁడు వయస్సున వృద్ధుఁ డయ్యెను, ఉత్సాహమునందును, కార్యములయందును తరుణవయ స్కుఁడై వీరవిహారము గావించుచున్నాఁడు. ఈతఁడు ఇటీవల వ్రాసిన కొన్ని యుత్తరములు అనుబంధములోఁ జూపఁబడినవి. ఈ మహా మహుఁడు ఇంకను చిరకాలము బ్రతికి భారతీయులకందఱకును మార్గ దర్శకుఁడై భారత దేశస్వపరిపాలనమును సాధించునట్లు చేయుటకు పర మేశ్వరుని ప్రార్థించుచున్నాము.

---

# 1. అనుబంధము.

బిసెంటునకు నిర్బంధావాసశిక్ష విధింపఁబడినపుడు డాక్టర్ సుబ్రహ్మణ్య అయ్యరు మహాశయుఁడు దేశీయులకు ఇట్లు వ్రాసెను:—

అస్మద్దేశీయులకు.—

శ్రీ చెన్నపురి గవర్నరుగారు తమశాసనసభయందొసంగినయుప న్యాసమును మనసుందఱము చదివితిమి. హోమురూలు విధానము నడంచుటకు యత్నములు చేయఁబడునను సూచనము అందు గాన్పిం చినది. స్వకీయ మగునట్టి గాని, వంశానుగతమగునట్టి గాని, పలుకు బడిగలవారందఱును ఈయత్నములందు తమకు తోడ్పడవలయు ననిరి. నేను బాధ్యత నెఱింగిన ప్రజాసేవకుఁడను. రాష్ట్రమున నున్నతన్యాయ స్థానపదవినిఁ బడసియుంటిని. చక్రవర్తిచే పరిగణింపఁబడి గౌరవింపఁ బడితిని. నావిశ్వవిద్యాలయమున మన్ననలను బడసితిని. వయోవృద్ధుఁ డను. విషయనిర్ధారణము జాగరూకత నభ్యసించినవాఁడను. పరిపక్వ మగు విషయనిర్ధారణదక్షతను గలవాఁడను; గాన నేను ప్రత్యుత్తర మిచ్చుచుంటిని. నేను నాభావమును దొరతనమువారికి స్పష్టపఱుచుట నాకు ముఖ్యకర్తవ్యముగ నున్నది.

నేను న్యాయాసనము నధిష్ఠించుటకు పూర్వము దేశీయమహా సభా సంబంధిని. నాకు స్వరాజ్యవిషయమును, హోమురూలువిషయ

మును నూతనములు గావు. దేశాభివృద్ధికిని, సామ్రాజ్యస్థిరత్వమునకును గూడ త్వరలో హిందూదేశమున స్వపరిపాలనావిధానము నేర్పఱుచుట యత్యవసరమని నేను నమ్ముచున్నాను. నేను చిరకాలమునుండి నమ్ముచుంటిని గతమాసమున దేశీయమహాసభవారు ఆజ్ఞాపించినచందమున న్యాయశాస్త్రవ్యతిరేకము కానట్టియు, విజ్ఞానప్రద మగునట్టియు నాందోళనము జరుపుట యవసరము. ఇండియాహోమురూలునకు గౌరవాధ్యక్షపదవిని నేను సంతోషపూర్వకముగ స్వీకరించితిని. చురుకుగ దీక్షతో పనిచేయుటకు తగినయారోగ్యస్థితియందు ఇపుడు లేకుండుట గౌరవపదవికి మాత్రమే అంగీకరించితిని. నేను ఇపుడు వెనుదీయఁజాలను. ఈలీగు న్యాయసమ్మతముకాదని ప్రకటింపఁబడినను నేను నా పదవికి రాజీనామాను ఇచ్చువాఁడనుగాను ఈనిశ్చితమువలన తటస్థించు శిక్షలను భరించుటకు సంసిద్ధుఁడను. ఐహికప్రభుత్వములు అన్నియు ఏసర్వేశ్వరుని హస్తంగతములో అట్టి జగదీశ్వరుఁడు మానవకోటికి ఒసంగిన స్వేచ్ఛాధికారమును కోరవలయునని భారతమాతకు ఆజ్ఞాపించు తరుణమాసన్నమైనది. యుద్ధానంతరమునసామ్రాజ్యపునర్నిర్మాణమును పదములతో దేశీయమహాజనసభవారు నిరూపించిన స్వపరిపాలనమును కోరుటకు అదను కలిగినది. హోమురూలును గోరుట పూతవిధియును పౌరధర్మమును గూడ నగునని నేను విశ్వసించుచున్నాను; గాన నేను ఈవిధిని నిర్వర్తించెదను. మీరందఱు నిట్లే చేయఁదగునని అస్మద్దేశీయులరగు మిమ్ముల నందఱను కోరుచున్నాను.

ఎస్. సుబ్రహ్మణ్యము, కే, సి, ఐ, ఎల్, ఎల్, డి.
రిటైర్డు ఆక్టింగు ఛీఫ్ జస్టిసు, చెన్నపురి హైకోర్టు.

---

## 2. అనుబంధము.

బిసెంటుదొరసానికి పుస్తకముల విక్రయమువలన చాలధనము వచ్చుచుండెనుగాని దొరతనమువారు ఆమె పుస్తకములను విక్రయింపఁ గూడదని శాసించిరి అపుడు డాక్టరు సుబ్రహ్మణ్యఅయ్యరు హిందూ పత్రికలో నిట్లు వ్రాసెను.

బిసెంటునకు విధింపఁబడిన నిర్బంధావాససమాచారము దుఃఖ

కరమే గాక క్రిజలసంతృప్తులగుదురనుటకు గూడ సందేహము లేదు. ఈమెకు ఇట్టిశిక్ష విధింపఁబడుటవలన భారతజాతికి కలుగునష్టము ఎల్లర కును విదితమే; కనుక ఈవిషయమును చర్చించుట నాయుద్యమము గాదు. దొరతనమువారియుత్తరువువలని ఫలితముల నించుక విచారింప వలసి యున్నది.

తమ గ్రంథముల విక్రయించినధనమువలన నీమె యిదివఱలో కాలక్షేపము చేయుచుండెను వర్తమానమున గ్రంథవిక్రయప్రచార ములను దొరతనమువారు నిరోధించిరి. దొరతనమువారి యాజ్ఞల నీమె తిరస్కరించిన యెడల జరిమానా, మూఁడుసంవత్సరముల కారాగార నివాసము నీమెకు విధింపఁబడును. ఇంతియగాక, అనేకుల నీమె పోషిం చుచున్నది. పైగా నీమెధనము నిలువచేసికొను స్వభావముకలది గాక చేతపైకము పడుటయే తడవుగ నాధనమును ప్రజలప్రంద వినియోగ పఱుచును. భారతీయులవిషయమున నీమె తన జీవితమును ధారవోసి యున్నది; గాన నిట్టితరుణమున నీమెకు ధనసహాయ మొనర్చుట మనవిధి. కృతజ్ఞతాపూర్వకముగ మన మొకనిధిని ఏర్పాటు చేసి, తన్నిధిద్రవ్య మును బంధవిముక్తి యగువఱకు బిసెంటుగారి ఖర్చులక్రింద వినియోగ పఱుపవలయును. ఈమె, నిధి ద్రవ్యమునుండి కాసైనఁ బుచ్చుకొనక పోవచ్చును. అట్లు జరిగినచో, నిధియందలి ద్రవ్యమును, మఱియొక కార్యమునకు వినియోగింపవచ్చును. భారతదేశమున కీమె యొనర్చిన సేవాసూచకమగు స్మరణచిహ్నము నొకదానిని నెలకొల్పవచ్చును.

న్యూఇండియాపత్రికకు సంబంధించినయొకచిన్నవిషయమును ఇచట వివరించుటయప్రస్తుతముగాదు. ఈపత్రికగతమూఁడుసంవత్సరము లయందును విపరీతముల నెన్నిటినో పుట్టించెను. నెల 1-కి 2, 3 మూఁడు వేలరూపాయలు నష్టము వచ్చుచుండినను ఇంతకాలమువఱకు పత్రిక నడుపఁబడినది. మొత్తమున పత్రికానిర్వహణమున మూఁడులక్షల రూపాయలు వ్యయమైనవి. వాడియా, ఆరండేలుగార్లుగూడ బిసెంటు గారివలెనే దుర్దశయం దున్నారు. బిసెంటుగారివలె వీరివిషయమున గూడ భారతీయులు కృతజ్ఞతతో చరించుట యావశ్యకము.

—

# 3. అనుబంధము.

ఈనెల 3వ తేదీని కామన్సుసభలో జరిగినవిషయములను గూర్చి తత్క్షణమే ప్రత్యుత్తర మొసంగుట అవసరమని గుర్తించుటచే నేను ఈలేఖను వ్రాయ సమకట్టితిని. ఈవిషయము పైకి వ్యక్తిసంబంధముగ కానవచ్చును; గాని కొంచెము యోచించిన నిది ప్రజాక్షేమమునకు సంబంధించినదని సుబోధకము కాకపోదు. నేను ప్రెసిడెంటు విల్సనుగారికి వ్రాసినలేఖను గుఱించి హాక్సుగారడిగిన ప్రశ్నకు మాంటేగ్యూగారొసఁగినప్రత్యుత్తరమును గూర్చియే నేను నుడువఁబోవుచున్నాను. ఇందును గుఱించి వార్తాపత్రికలలోను, అందు ముఖ్యముగ ఆంగ్లో యిండియను పత్రికలలోను తీవ్రమగు చర్చ జరుగుచున్నను ఇందు నాకు సంబంధించిన విషయములను నేను విమర్శింపఁ బూనుకొనలేదు. ఈవిషయమున కొన్నివారములకు పూర్వము న్యూయిండియాపత్రికలో ప్రకటనములు గావింపఁబడుటవలనను, అవియన్నియు పుస్తకరూపముననిప్పుడు వెలువడుటచేతను, అస్మద్దేశీయులకు నూతనవిషయములను నేనేమియు తెలుప నక్కఱ లేదని యింతవఱకును మిన్నకుంటి; కాని హాక్సుగారి ప్రశ్నకు మనకార్యదర్శిగా రొసంగిన ప్రత్యుత్తరము నన్ను ఈయుత్తరమును లిఖింపఁ బ్రేరేపించినది. ఇంతకు బూర్వము గత డిసెంబరుమాసమున మాంటేగ్యూరాజప్రతినిధి గార్లు మదరాసునగరమునకు వచ్చినపుడు జరిగినసంగతులను గూర్చియు, 8-2-18వ తేదీ చెన్నపురి ప్రభుత్వకార్యదర్శివద్దనుండి వచ్చినయుత్తరమును గూర్చియు నించుక తెలుపవలసియున్నది.

## మాంటేగ్యూ రాజప్రతినిధి గార్లను సందర్శించుట.

మాంటేగ్యూ రాజప్రతినిధిగార్లను సందర్శించుటకు నియుక్తులైన వారిలో నేనొకఁడనని అనేకులకు తెలియును. నేను నియమిత కాలమునకు ప్రభుత్వమువారి గృహమునకుఁ బోయి నాకేర్పఱుపఁబడిన స్థలమున నాసీనుఁడ నైన తోడనే రాజప్రతినిధిగారు తీవ్రముగ సంభాషణము నారంభించుటచే నేను విభ్రాంతమానసుఁడ నైతిని. నా లేఖతో సంబంధించిన ప్రముఖులను గూర్చియు,నన్నుగూర్చియు వారు

పలికిన వాక్యములను ప్రకటించుటయందు నేను ఎట్టి రహస్యమును బయలుపఱుచుట లేదు.ఆసంభాషణమురహస్యమని ఎవరును తలంపరు.

ప్రథమముననే రాజప్రతినిధిగారు ఆగ్రహావేశపరవశులై నేను విల్సనుగారికి వ్రాసినలేఖను గుఱించి మాటాడిరి. నన్ను వారు న్యాయదృష్టితో తిలకింపలేదనియు, నన్నువారు తూలనాడిరనియు నేను అనుకొనవలసివచ్చినది ఏలనన: నేను అచ్చట రాజకీయవిషయములను చర్చింపఁబోయి యుంటిని; గాని ప్రెసిడెంటు విల్సనుగారికి నేను లిఖించిన కమ్మకై రాజప్రతినిధికి జవాబొసఁగ సంసిద్ధుఁడనై పోలేదు. ఈవిధముగ నాకస్మికముగ నన్నెదుర్కొనుట రాజప్రతినిధికి తగదని నేను పలుకక నాకప్పుడు తోఁచినవిధమున వారి ప్రశ్నలకు ప్రత్యుత్తర మొసఁగియేయుంటిని. నే నాలేఖ వ్రాసినప్పుడు నిష్కపటహృదయముతో నే వర్తించితి ననియు, శ్రీచక్రవర్తిగారిస్నేహితులును, మిత్రమండలి వారి సంగ్రామాశయములతో నేకీభవించినవారును అగు అమెరికాప్రెసిడెంటుమూలముననే ఆసమయమున హోమురూలర్లకు క్షేమము గలుగునని అభిప్రాయము నాకు ఉండెననియు నేను వారితో నుడివితిని.అప్పటిపరిస్థితులు ఈవిధముగ నున్నవి హోమురూలు సమితియందున్న నలుగురు ప్రముఖులలో ముగ్గురు, అనఁగా: అధ్యక్షురాలగు బిసెంటుదొరసానిగారును, కార్యదర్శియగు ఆరండేలుగారును, కోశాధికారియగు వాడియాగారును, నిర్బంధావాసశిక్షపాలు కాఁబడిరి. ఆనరరీఅధ్యక్షుఁడనగు నన్నుగూడ స్థానికప్రభుత్వమువా రీవిధముననే శిక్షింతురని వదంతి ఎల్లయెడల ప్రబలముగా నుండెను; గావున అప్పు డిచ్చటకు వచ్చి, మఱల తమస్వదేశమగు అమెరికాకు పోవనున్న హోచ్నరుగారియొక్కయు, వారి సతియొక్కయు ఆగమనమువలన లాభమునందఁ దలఁచి, వీరి కమెరికా ఖండమున, భారతదేశమునకు ఉపకారము చేయఁగల స్నేహితులు అనేకులు ఉండుట గ్రహించి, వీరు బిసెంటుప్రభృతుల విమోచనమునకై కృషి పలుపఁగలరను విశ్వాసముతో ఆలేఖను రచించి వారిమూలమున విల్సనుగారికి అందఁజేసితిని. ఆలేఖయం దీ దేశప్రభుత్వమునెడలఁగావింపఁబడిన దోషారోపణముల నన్నిటికిని తగిన నిశ్చితనిదర్శనములు గలవనియు, అవసరమగు నెడల వంగదేశమున నిర్బంధశిక్ష ననుభవించు

చున్నవారి హృదయనిర్భేదకములగు కడగండ్లను గూర్చి నావద్దనున్న లేఖలను అధ్యక్షున కంపెదనని వ్రాసితిని.

### మదరాసు ప్రభుత్వకార్యదర్శి లేఖ.

ఈవిషయమై యింక నెక్కుడువిపులముగ వ్రాయనవసరములేదు. కార్యదర్శిగారిసమక్షమున, వారి అనుమతిని, వారిపక్షమున, రాజప్రతినిధిగారు నావర్తనమునెడల తమ అసంతృప్తిని వ్యక్తపఱిచిరని ఇచట నుడివినఁ జాలును. పిమ్మట నా లేఖనుగూర్చి ఇండియను,మదరాసు ప్రభుత్వములకు ఎట్టిసంభాషణజరిగినదో నా కేమియు తెలియదు; గాని చెన్నపురి ప్రభుత్వ కార్యదర్శియొద్దనుండి మాత్రము నా కీలేఖ వచ్చినది.

సెయింటు జార్జికోట
చెన్నపట్టణము 8-2-1918

అయ్యా!

అమెరికాసంయుక్తరాష్ట్రాధ్యక్షునకు మీరు వ్రాసిన లేఖయొక్క అచ్చుప్రతులు ఆలోచనసభాసమేతులగు గవర్నరుగారికి అంపఁబడినవి. మెయిలుద్వారా పంపినయెడల ఆ లేఖ గమ్యస్థానము చేరదను నుద్దేశముతో హేన్రీహిచ్నరుగారును, వారిసతియు ఈ లేఖ వ్రాయఁబడిన కొలఁదిదినముల లోపుననే అమెరికాకుఁ బోవుచుండుటచే వారిద్వారా నీలేఖను మీరుపంపిరని తెలియుచున్నది. ఆయుత్తరమున ౨౮ జూను ౧౯౧౭ అను తేదీ యున్నది ఈవిషయమున రాజప్రతినిధిగారును, కార్యదర్శిగారును ప్రశ్నించి, మిమ్ము చీవాట్లు పెట్టిరని గవర్నరుగారికిని, వారిసభకును ఎఱింగింపఁ బడినది. ఈస్థితిగతులలో మీపై నిక నెట్టి చర్యను నడుపకుండుటకు గవర్నరుగారును, వారి సభవారును నిశ్చయించిరి.

ఇట్లు
లయొనల్ డేవిడ్సను,
ఆక్టింగు ప్రధానకార్యదర్శి.

### మాంటేగ్యూగారు ఎత్తువారిచేతిబిడ్డ.

ఈయుత్తరమువలన ఈవిషయమంతము నొందినదని యెల్లరును దలఁచిరి; గాని దురదృష్టవశమున సంగ్రాహమంత్రివర్గమువారి నాయకత్వ

మున మనసామ్రాజ్యమునకును, హిందూదేశమునకును, అపాయకరముగ పరిణమించుపరిస్థితులు ఏర్పడుచున్నవి. మనకార్యదర్శి ప్రప్రథమమున నెట్టి ఆశయాపూరితుఁడై నను, భారతభూమియందు అడుగిడిన తోడనే ఇచ్చటి నిరంకుశాధికారులవలలోఁ దగుల్కొనినాఁడు. ఆంగ్లోయిండియనులును, సిడెంహాము పక్షమువారును, ఈతఁడు చక్రవర్తి మంత్రికిఁ దగినబాధ్యతా గౌరవములతో వర్తింపఁజాలఁ డనియు, అచ్చటి వారియిష్టానుసారము ఎత్తువారిచేతి బిడ్డఁడై వర్తించుచనియు గ్రహించిరి. జూను 3 వ తేదీని జరిగిన విషయములను బట్టి ఈసారాంశము తేలుచున్నది.

భావిచర్యానిరోధపరిత్యాగము.

విల్సనుగారికి వ్రాయఁబడిన లేఖను మంత్రివర్గమువారు తమకు కొలఁదికాలము క్రిందటనే పంపిరని రాజప్రతినిధిగారు నాతోఁ జెప్పియున్నారు; గావున కార్యదర్శిగారికి అప్పటికి ఈవిషయమై తెలిసియుండకపోదు. ఒకవేళ వారికి దీనినిగుఱించి తెలియదనుకొనినను రాజప్రతినిధిగారు నాయెడలఁ గావించిన నిందకు వారుకూడ అంగీకరించిరి. చెన్నపురి ప్రభుత్వప్రధానకార్యదర్శి యుత్తరువుమాంటేగ్యూ రాజప్రతినిధిగార్ల అనుమతిలేక వెలువడియుండదు 3 వ తేదీని పార్లమెంటులో జరిగినవిషయమై నాపై నెట్టి చర్యను దీసికొనినను అందులకు నేను అంగీకరించుచున్నాను. నామాతృదేశమునకై న ఎట్టి శిక్షనైన నేనాహ్వానింతును. ఈవిషయము నాదేశమునకు అంతకును సంబంధించినది. ఇందులకు నేను స్వార్థత్యాగముతో వర్తింపననువు దొరకుట నాఅదృష్టమే; గాని వేఱొండుగాదు. నిర్బంధావాసమైనను, ద్వీపాంతరవాసమైనను, మఱి యెట్టి శిక్షయైనను నాకు భయకారకము కాఁజాలదు. ఈప్రపంచ గౌరవముల నాశింపని వయసునందు భారతదేశస్వరాజ్యసంపాదనమునకై అధికారనిరంకుశమువాఁతఁ బడుటకంటె నాకు వేఱొండు గౌరవము లేదు.

నిరంకుశాధికారపరిపాలనా ఫలితముగ వాటిల్లనున్న అపాయమునుండి బ్రిటిషుసామ్రాజ్యమును సంరక్షించి భారతదేశము నుద్ధరించుటకై గతవత్సరమున నిర్బంధావాసశిక్షలు దేవతలవలన నుద్దేశింపఁబడిన

వని తలంచెదను. ఈకార్యము దేశమందంతటను ఉత్సాహమును పురి
కొల్పినది. ఇప్పుడు మఱల దేశము నిద్రావస్థయం దున్నది. మఱల దానిని
మేల్కొల్పుటకు నాయొకలఁ గావింపఁబడు చర్య కారణభూతమగునేని
నేను ధన్యుఁడను. నా దేశీయులు ఈవిషయమును గ్రహించి బ్రిటిషు
సామ్రాజ్యాధీనమైన స్వరాజ్యము భారత దేశమునకు లభ్యమగునటుల
శాస్త్రసమ్మతాందోళనము కావించెదరు గాక.

కాక్సుగారి ప్రశ్నకు ఉత్తరమొసంగునపుడు కార్యదర్శిగారు ఉప
యోగించిన మర్యాదాహీనమగుభాష స్వీయపక్షసంతృప్తికై అక్కడ కా
వింపఁబడిన తంత్రముయొక్క ఫలితమని నా అభిప్రాయము; గాని అతఁడు
ఈ దేశమున నున్నప్పుడు నన్ను నిందించినవిషయము నచ్చటివారికెఱుక
పఱచి తన నిష్పాపట్యమును వ్యక్తపఱచి యున్నచో ఎంతబాగుండును?
గాని విల్సనుగారికి లేఖసంపుటలో లజ్జాకరవిషయ మెద్దియు లేదు.

## సర్ బిరుదవిసర్జనము.

నావిషయమున నెట్టిచర్యజరుపవలయు నని మాంటేగ్యూగారి
మానసమున నున్నదో నాకు తెలియుటలేదు. వారు నా సర్ బిరుద
మును తొలఁగింప నెంచినచో ఆవిషయమున వారితో నాకంటె
నెక్కుడు మనఃపూర్వకముగ నంగీకరించువారు వేఱొకరు ఉండఁ
జాలరు. ఈదేశమునందు బిరుదములు వ్యక్తుల యిష్టము లేక యేయొసఁ
గఁబడుచుండును. నామరణానంతరము నైన ప్రభుత్వమువారికి తిరిగి
యొసంగవలసిన యీ బిరుద చిహ్నములను ఇప్పుడే సంతోషపూర్వక
ముగ ప్రభుత్వమువారి కిచ్చివేసెదను.

### నా సర్ బిరుదచరిత్రము.

ఈబిరుదము నేను దేశమునకుఁ గాని, ప్రభుత్వమువారికిఁ గాని
చేసిన సేవా ఫలితముగ నాకు లభింపలేదు. నేనుధనవ్యయము చేసి దీనిని
గడింపలేదు. ౧౮౯౯ వ సంవత్సరము ఆగష్టు నెలలో సర్ ఆర్థరుకాలిన్సు

గారు ప్రధానన్యాయమూర్తిపదవినుండి తొలఁగి పోయిన పిమ్మట వారి స్థానమున నేను తాత్కాలికముగా పనిచేసితిని. ఈపదవిని నాకు శాశ్వతముగ నొసంగనిచ్ఛలేకపోవుటచే మామూలుప్రకారముగ ప్రభుత్వము వారు నాకు సర్ బిరుదము నొసంగి సంతృప్తి పఱుపఁజూచిరి. ఇది సామాన్యముగ జరుగువిషయమే. పిమ్మట నేను పళనికొండలపై నా స్వగృహమున నుండఁగా నీబిరుదుచిహ్నములు నేవిధముగ నందుకొందువని నాకు తెలియఁజేయఁబడెను. పోస్టుద్వారా పంపుఁడని నేను ప్రత్యుత్తర మొసఁగితిని. ఇది అధికారులకు రుచింపలేదు; గాన యొక ప్రాతఃకాలమున జిల్లాకలెక్టరువచ్చి నాకు ఆబిరుదుచిహ్నముల నొసంగి వెడలిపోయెను

బిరుదముల నిజస్థితి.

ఈబిరుదముల నిజస్థితిని గుఱించి స్వీడనుదేశచరిత్రమునం దిట్లు వ్రాయఁబడినది. ఆదేశమున మొట్టమొదట బిరుదములు ప్రవేశముగాంచినప్పుడు ఇరువురుస్నేహితులకు బిరుదములు ఒసంగఁబడెను. వారు ఇరువురును అన్యోన్యానందము గావించుకొనిన పిమ్మట అందొకఁడు ఇట్లు అనియెను. "సోదరుఁడా, ఈబిరుదముల మూలమున నీవు ఎంతపొడవైతివి? కావున పాశ్చాత్యదేశములనుండి దిగుమతియైన వస్తువులలో నీబిరుదములకంటె నెక్కుడు మోసము లేదు. మర్యాదగలవారెల్లరును వీనినుండి తొలఁగుటకు యత్నింపవలెను."

నా ఉపకారవేతనము.

నాయుపకారవేతన విషయమునఁ గూడ నేను ఈవిధముగనే జవాబు ఈయఁగలవాఁడను. నా దేశాదాయమునుండియే నాయుపకారవేతన మొసంగఁబడుచున్నది మఱియు నివి పార్లమెంటువారి అనుమతి నొసంగఁబడుచున్నది; గాన ఆపార్లమెంటు శాసనమువలన నేదక్క ఇతర విధముల దానిని తొలఁగించుట అసంభవము.

ఈయుపకారవేతనమును కోల్పోవుటకు నేనెంతమాత్రమును వెనుదీయను. ఈవిషయమున నన్ను బెదరించు ఆంగ్లోయిండియనుపత్రి

కలు ఈయుపకారవేతనము తీసివేయఁబడిన నాకు సన్న్యాసిసంఘము నుండి సహాయమురాఁగల దని యెఱుఁగవలయును. ఈసంఘము దివ్యజ్ఞానసమాజము కాదని నేను చెప్పవలసియున్నది.

సర్ జె. డి. రీసుగారు.

నాయుత్తరము వృద్ధత్వజనితమగు బుద్ధిమాంద్యఫలితమని రీసుగారు పలికిన వాక్యమును గూర్చి యించుక చెప్పవలసియున్నది. ఈతని వాక్యములు అసత్యములని నేను మున్మాటికిని చెప్పఁగలను. నాధీశక్తి యిప్పటి కంటె నెక్కుడు తీక్ష్ణముగ నెప్పుడును లేదు. కామన్సు సభలో నీసభ్యుని జీవితము మొదటినుండి నేటివఱకును సద్బుద్ధిని వ్యక్తపఱిచి యుండలేదని చెప్పక తప్పదు.

యస్. సుబ్రహ్మణ్య అయ్యరు.

---

'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము. చెన్నపురి. 1923.

# ఆంధ్ర గ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చ తెనుగురామాయణము, శుద్ధప్రతి | .... | 1 | 4 |
| అధ్యాత్మరామాయణము, ప్రాచీనప్రతి | .... | 1 | 0 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | .... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము, కనుపర్తిఅబ్బయామాత్యప్రణీతము | | 0 | 8 |
| అప్పకవీయము, నూతనముద్రితము | .... | 2 | 8 |
| ,, విమర్శనము మాత్రము | .... | 0 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక (భాగవతము) | .... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాకితములమీఁద చక్కఁగ మరలముద్రించియున్నారము | .... | 3 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | .... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకుముద్రితమైనప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది | .... | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి, రెండువాల్యములు | .... | 8 | 0 |
| శ్రీమదాంధ్రభారతము-పద్యకావ్యము:— | | | |
| 7 సంపుటముల ప్రతి | .... | 15 | 12 |
| 3 సంపుటముల ప్రతి | .... | 15 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | .... | 2 | 4 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు ,, | .... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములుగల సంపుటము | .... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు | .... | 2 | 4 |
| శాంతిపర్వము | .... | 2 | 4 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములుగల సంపుటము | | 2 | 4 |

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | .... | 6 | 8 |
| యుద్ధపంచకము స్త్రీపర్వము ,, | .... | 4 | 4 |
| శాంతిసప్తకము ,, | .... | 4 | 4 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాదిసూర్యనారాయణశాస్త్రి | | 0 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | .... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | ... | 0 | 12 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు టీకానుక్రమణికా సహితము | .... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | .... | 1 | 0 |
| ఆంధ్ర చంద్రాలోకము, సటీక | .... | 0 | 8 |
| ఆనందరంగరాట్ఛందము | .... | 1 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటిపాపరాజప్రణీతము చక్కనికూర్పు | .... | 2 | 4 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర | .... | 1 | 8 |
| కళాపూర్ణోదయము, నళసరికాకితములు | .... | 2 | 4 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు | .... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | .... | 0 | 4 |
| డిటో గట్టుప్రభువుకృతము | .... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము, కుమారధూర్జటికృతము | .... | 0 | 8 |
| గజేంద్ర మోక్షము, సటీక, చక్కనికూర్పు | .... | 0 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనముమిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము | .... | 5 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | | 1 | 0 |
| నరసభూపాలీయము, అట్టబైండు | .... | 0 | 10 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము, వేంకటరంగశాస్త్రికృతము | .... | 6 | 8 |
| డిటో 3 వాల్యములు | .... | 7 | 0 |

# ఆంధ్రవచనగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ద్వాదశోపనిషత్తులు, సంస్కృతమునకు సరియైన తెలుగువచనము | .... | 3 | 0 |
| పంజాబుఅల్లరి, సహాయనిరాకరణోద్యమము, దేశీయమహాసభవారిచే నిర్మింపఁబడిన కమిటీవారిరిపోర్టు ననుసరించి ఆంధ్రప్రజాసంఘము వారిచే చిత్రపటములతో ప్రకటింపఁబడినది | .... | 0 | 8 |
| తిలకుగారి సెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | .... | 0 | 14 |
| మదనమోహన మాళవ్యగారి జీవితము, పంజాబుఅల్లరి | | 0 | 2 |
| శ్రీవివేకానందవిజయము | .... | 1 | 12 |
| ప్రాచీనదేశ చరిత్రలు | .... | 1 | 12 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము | .... | 0 | 12 |
| డిటో రెండవభాగము | .... | 0 | 8 |
| శ్రీమహాభక్తవిజయము | .... | 4 | 0 |
| హితోపదేశము, సులభశైలి | .... | 0 | 12 |
| సంగ్రహరామాయణము, శ్రీ శేషాద్రిశర్మకృతము | .... | 0 | 10 |
| సంగ్రహభారతము ,, | .... | 1 | 0 |
| సంగ్రహభాగవతము ,, | (అచ్చగుచున్నది.) | | |
| దశకుమారచరిత్రము, ఎనమచింతల సంజీవరాయశాస్త్రిది | | 1 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము | .... | 0 | 8 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు | .... | 0 | 14 |
| భోజకాళిదాసకథలు, 1-వ భాగము | .... | 0 | 12 |
| దక్కనుపూర్వకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | .... | 1 | 8 |
| సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | | 1 | 4 |
| భోజునికథలు | .... | 0 | 8 |
| విక్రమార్కునికథలు | .... | 0 | 8 |
| బేతాళునికథలు | .... | 0 | 8 |
| పరమానంద శిష్యులకథలు | .... | 0 | 3 |
| వైద్యులకథలు | .... | 0 | 4 |
| తాతాచార్యులకథలు | .... | 0 | 6 |
| నలుగురుమంత్రులకథలు | .... | 0 | 4 |